# పడిలేచిన కెరటం

[illegible]

"ఏం రాఘవా! ఏదో సాకులతో నచ్చిన పెళ్ళిసంబంధాలన్నీ తప్పించేస్తున్నావు. ఎవరినైనా ప్రేమించావా ఏమిటి?" శివరావు అన్నంలో పప్పుకలుపుకుంటూ రాఘవని అడిగాడు.

రాఘవ ఉలిక్కి పడ్డాడు.

మొన్న తను కాలేజీనుండి ఇంటికి రాగానే చిన్న వదిన శాంత అంది.

"ఏమోయ్ రాఘవా! మీ నాన్నగారు అర్జంటుగా రమ్మని ఉత్తరం వ్రాశారు. ఇదిగో" అంటూ ఉత్తరం అందించింది.

ఉత్తరం చదువుకున్నాడు. అందులో ఏం లేదు. తనని ఒక్కసారి అర్జంటుగా రమ్మని ఉంది.

"సరే. రేపే వెడతాను ఒదినా!" అన్నాడు.

అంతే. బయలుదేరి వచ్చాడు యింటికి. ఇప్పుడు నాన్నగారి యీ ప్రశ్నతో రోజా విషయ మేమైనా తెలిసిందా అని అనుమానం వచ్చి ఆయనముఖంలోకి చూశాడు.

ఆయన తాపీగా, అన్నంతింటూ "ఏం లేదు. బంగారం లాంటి సంబంధాలు వస్తున్నాయి. లక్ష్మి పెళ్ళికి చేసిన అప్పు వడ్డీతోసహా పాపం పెరిగినట్లు పెరిగిపోతోంది. అన్నయ్యిద్దరి సంపాదన వాళ్ళభుక్తికే బొటాబొటీగా సరిపోతోంది. అప్పిచ్చిన పెద్దమనిషేమో 'నా సొమ్ము రెండు నెలల్లో తీర్చేయాలి' అంటూ గొడవ పెడుతున్నాడు..." ఆయన బాధ ఆయన చెప్పుకుపోతున్నాడు.

అసలు కట్నం తీసుకుని పెళ్ళిచేసుకోవటం యిష్టం లేని రాఘవకు తండ్రి తనమీద పెట్టుకున్న ఆశలకు ఆశ్చర్యం కలిగింది. మొదటినుండీ తన ఆశయాలు, ఆదర్శాలూ తండ్రికి తెలుసుండీ ఆయన యిలాగ మాట్లాడారంటే ఏమనుకోవాలి? పాపం ఆయన బరువుబాధ్యతలు ఆయనవి!

"నాన్నగారూ! ఆ అయిదు వేల రూపాయలఅప్పు వడ్డీతోసహా నేను తీరుస్తాను. మీరు దానిగురించి దిగులు పడకండి" అని హామీ ఇచ్చాడు రాఘవ.

శివరావు భోజనం ముగించి చేయికడుక్కుని బయటకు వెళ్ళబోతూ—

"అదికాదోయ్! అప్పు విషయం మలా వుంచు! నువ్వు ఉద్యోగంలో చేరావు. ఒకింటివాడివి కావాలికదా! ఎన్నాళ్లు

యిలాగ? నీ పెళ్ళికూడా అయిపోతే యిప్పటి మట్టుకి హాయిగా వుంటానునేను." పెద్ద వదిన వెంకటలక్ష్మిఅంది. పేరుకు పెద్ద వదినేగాని, కన్న తల్లికంటే మిన్నగా పెంచింది తననీ, చిన్నన్నయ్యనీ, లక్ష్మినీను. పెద్దన్నయ్య తరువాత నలుగురు పిల్లలు దక్కలేదు తనతల్లికి. తరువాత చిన్న న్నయ్య, తనూ, లక్ష్మి పుట్టారు. లక్ష్మికి అయిదు సంవత్స రాల వయస్సుండగా పెద్దన్నయ్య పెళ్ళిఅయింది. మరో ఏడాదికి తన తల్లి కన్నుమూసింది. అప్పటినుండీ జాగ్రత్తగా పెంచి పెద్దచేసింది తన పెద్దవదిన.

"నేను నీ కంత బరువుగా వున్నానా వదినా! నన్ను వదిలించుకుందామని చూస్తున్నావా?" హాస్యంగా అన్నాడు రాఘవ.

"ఎప్పటి కప్పుడే తప్పించుకుంటున్నావు కాని ఈసారి రెండునెలల్లోగా నీ పెళ్ళి జరిగితీరాలి, రాఘవా!" పెద్దవదిన గట్టిగా అంది.

"సరేలేనమ్మా" అన్నాడు వదినని చిన్నబుచ్చటం యిష్టంలేక.

"సరేలే అంటేకాదు. నీకు నచ్చిన అమ్మాయి ఉంటే చెప్పు. లేకపోతే నాకు నచ్చిన అమ్మాయిని కట్టబెడతాను" బెదిరిస్తున్నట్లు అంది.

"నీ వాయిదాలోగా నా పెళ్ళి అవాలనికదా నీ పట్టు దల. సరేలే! ఇవాళ సాయంకాలం బయలుదేరి వెడతాను. కొత్తగా జాబ్‌లో చేరాను కదా సెలవు లివ్వరు" అన్నాడు

తను వెళ్ళగానే రోజాను కలుసుకుని అంగీకారం తెల పాలి. ఇన్నాళ్ళూ తనే జాప్యం చేశాడు.

“నువ్వెప్పుడు వూఁ, అంటే అప్పుడు నాన్నగారితో మాట్లాడతాను, రాఘవా! తొందరగా వూ అను” అని మారాంచేసే రోజా జ్ఞాపకంవచ్చి, అతని పెదవులమీద చిరునవ్వు మెరిసింది.

అసలు రోజాతో తన పరిచయమే చిత్రంగా జరిగింది. మొదట్లో ఆమె ధనవంతులనీ, అందగత్తెననీ, అటువంటి వాళ్ళతో చనువుగా వుండకూడదనీ ఎంతో తప్పించుకు తిరిగేవాడు! ఎంత తప్పించుకు తిరిగితే అంత దగ్గరకువచ్చేది.

అప్పుడు రాఘవ బి. ఎస్. సి. చదువుతుండేవాడు.

రాఘవ, రామ్ కెమిస్ట్రి లాబ్ నుండి వస్తున్నారు. “అరే రాఘవా! అటుచూడరా. ఆ ఫాషన్ లేడీని. అందం, డబ్బు అన్నీవున్న ఆ అమ్మాయి యీ రోజే యింటర్ లో చేరటానికి కాలేజీకి వచ్చింది. రాజకుమారిలా వుందికదూ! పేరు రోజా”ట.

అంతవరకూ తల వంచుకునే నడుస్తున్న రాఘవ ఒక్కసారి తల ఎత్తాడు. ఆ అమ్మాయిని చూడాలనే కుతూహలంతో కాదు. యథాలాపంగా ఎత్తాడు. ఎదురుగుండా పదిమంది అమ్మాయిల మధ్య వున్నది రోజా. జుట్టు మెడల వరకూ కత్తిరించివుంది. లిప్ స్టిక్, కళ్ళకు గాగుల్సు, కాళ్ళకు హైహీల్సు, తెల్లగా మిసమిసలాడుతూ మెరుపు తీగలా కనిపించింది. కొద్దిగా పొట్టిగా, పీలగావుంది.

“ఆ అమ్మాయి రాజేశ్వరరావుగారని, అబ్బ! పెద్ద ధనవంతులటలే. ఆయనగారి గారాల పట్టి. పెద్ద కూతురట. ఆయన కిద్దరే కూతుళ్ళట.” రామ్ కు అన్ని వివరాలు ఎలా తెలుసో అని ఆశ్చర్యం వేసింది రాఘవకు.

అమ్మాయిల వివరాలు తెలుసుకోవటంలో వున్న ఆసక్తి చదువుమీద చూపిస్తే బాగుపడేవాళ్ళు అని పించింది రాఘవ్ కు.

"నోరెళ్ళ బెట్టుకుని అమ్మాయిలను చూడ్డంతప్ప గా అబ్బాయిలకింకేం పనిలేదు కాబోలు" తను ప్రక్కనుండే వెళ్తూ అన్న గిరిజా మాటలకు ఉలిక్కి పడ్డాడు రాఘవ.

తననీ, రామ్ నీ ఉద్దేశించే అంది ఆ అమ్మాయి. సందేహం లేదు అనిపించింది రాఘవకు.

గిరిజా ప్రక్కనే నడుస్తున్న షీలా అనే అమ్మాయి భయపడ్డట్లు కనిపించింది. మరి...రాఘవ్ ను అందరూ ఎంతో గౌరవిస్తారు. అతనసలు అమ్మాయిలవైపు ఎప్పుడూ కన్నెత్తి చూడడు.

గిరిజా అలా అన్నందుకు రాఘవ ముఖం జేవురించింది.

మరో రెండు రోజులు గడిచిపోయాయి. గిరిజా కారు డ్రైవ్ చేసుకుంటూ ఇంటికి వెడుతోంది కాలేజీనుంచి. ఆదారమ్మట జనం ఎవరూ తిరగటం లేదు. సడన్ గా గిరిజా కారు ఆగిపోయింది. ఏమయిందని అనుకుంటూ దిగి చూసింది. అంతుపట్టలేదు. బేలగా చుట్టూ చూసింది గిరిజా. దూరంగా రాఘవ, రామ్ వస్తున్నారు. ఆ రోజున అలాగ అన్నందుకు షీలా నొచ్చుకుంది. అతన్ని అందరూ గౌరవిస్తారు. అతను చాలా తెలివైన విద్యార్థి అనీ, అంతేకాక ఆటల్లో, వక్తృత్వ పోటీలలో అన్నింటిలో ఫస్టుప్రైజు అతనిదేననీ, అనవసరంగా ఎవరితోనూ మాట్లాడడనీ చెప్పింది. అంత మంచివాడయితే

ఆరోజు తనని ఎందుకలాగ చూడాలి అనుకుంది రోజా. డబ్బా? అందమా? ఆకర్షణా? తనలాంటి అందగత్తె, డబ్బున్నదీ కంటబడితే ఎందుకు చూడదూ!

"ఏమయిందండీ! యిక్కడ ఆగిపోయారు పాపం?" రామ్ మాటలతో ఉలిక్కిపడి ఆలోచనలనుండి తేరుకుంది రోజా.

"ఆ! కారు ట్రబుల్ యిచ్చిందండీ. కొంచెం చూస్తారా?" రోజా దర్పంగా అడిగింది.

"నాకేం తెలుసండీ కారుగురించి! పాపం యిప్పుడెలాగ?" సానుభూతిగా అన్నాడు రామ్.

రామ్‌కు కొంచెం దూరంలో రాఘవ నుంచున్నాడు ఎటో చూస్తూ.

"మీ స్నేహితుడిగారిని అడగండి ప్లీస్" అన్న రోజా మాటలకు ఇటు తిరిగాడు రాఘవ.

దీనంగా రాఘవవైపు చూసింది రోజా. చలించిపోయాడు రాఘవ. కారును చూసి స్టార్టు చేశాడు.

స్టార్టయింది.

కారులో కూర్చుని స్టార్టుచేస్తూ, "థాంక్సండీ మీకు లిఫ్టు యిస్తాను, కారు ఎక్కండి" అంది రాఘవ రామ్‌ల నుద్దేశించి గర్వంగా.

ఏమిటీమె! యిందాకా అంత దీనంగా చూసింది. ఇప్పుడింత గర్వంగా మాట్లాడుతోంది అనుకున్నాడు రాఘవ.

"థాంక్స్ వెళ్ళిరండి" గంభీరంగా అన్నాడు రాఘవ. రోజా కారు వెళ్ళిపోయాక రామ్ ఎంతో ఫీలయ్యాడు.

"అయ్యో, చక్కగా ఆమె కారులో వెళ్ళేవాళ్ళం కదురా! సరదాగా ఆమెతో మాట్లాడుతూ వెళ్ళేవాళ్ళం" అంటూ బాధపడిపోయాడు. "రామ్ నీ అతివాగుడు కట్టి పెట్టు. ఇక్కడికి వచ్చింది చదువుకోసం కాని యిలాంటి సరదాలకి కాదు" మందలించాడు రాఘవ.

"బాగుంది! నేనేమైనా ఆ అమ్మాయిని ప్రేమిస్తా నన్నానా ఏమిటి? ఏదో సరదాగా మాట్లాడితే యేమయింది! అందమైన వస్తువును అందరూ చూస్తారు. ఆనందిస్తారు. అలాగే నేనూను. కాని పని యేమయినా చేస్తానన్నానా?" బిక్క మొహం పెట్టాడు రామ్.

"సరే బాగుందిలే నీ ఉపమానం. ఆమె ఒక వస్తువు కాదు. మనిషి." రాఘవ మాటకు రామ్ మవునంగా ఉండి పోయాడు.

వారం రోజులు మామూలుగా గడిచిపోయాయి.

"రాఘవగారూ రేపు మా యింటికి పార్టీకి రావాలి సాయంకాలం"

సైన్సు లేబొరేటరీ నుండి వస్తున్న రాఘవ ఆ మాట లకు తల ఎత్తాడు. ఎదురుగా రోజా!

"ఎందుకు?" అన్నట్లు చూశాడు రాఘవ.

"నా పుట్టినరోజండీ. మీరు భలేవారు. కళ్ళతోనే మాట్లాడతారు!" కిలకిలా నవ్వింది రోజా. ఆమె నవ్వు రాఘవను కదిలించింది.

"రేపు సరిగ్గా సాయంకాలం ఆరు గంటలకు వచ్చే యండి. రామ్‌గార్ని కూడా తీసుకురండి" నవ్వుతూ వెళ్ళి పోయింది.

"ఏమిటి రాఘవ, రాజకుమారి నీతో మాట్లాడు తోంది?" అప్పుడే సైన్సు లేబరేటరీనుండి వస్తున్న రామ్ సంతోషంగా అడిగాడు.

"తన పుట్టినరోజట. పార్టీకిరమ్మంది నిన్నుకూడా తీసుకొని." మామూలుగా అన్నాడు రాఘవ.

"వెడదాం" హుషారుగా అన్నాడు రామ్.

"నీ కేమైనా మతిపోయిందా? మనం ఆమె క్లాసు మేట్సుంకాదు, ఏం కాదు. రెండోవిషయం ఏమింటే, ఈ ధనవంతులు ఇలాంటి పార్టీలు బహుమతులకోసం చేసు కొంటుంటారు. పెద్ద పెద్ద శ్రీమంతులు మంచి మంచి బహు మతులు తెచ్చియిస్తారు. అలాంటిచోటికి మనలాంటివాళ్ళం వెళ్ళటం అంత మంచిది కాదు" సీరియస్‌గా అన్నాడు రాఘవ.

"ఇంతకీ బహుమతి కొనలేనని మానేస్తామా! నా యీ వుంగరం తాకట్టుపెట్టి, ఆ డబ్బుతో బహుమతికొని తీసుకు వెళ్ళవచ్చు" రాఘవను ఒప్పించాలనే వుద్దేశంతో అన్నాడు రామ్. అతని కెలాగైనా రోజా పుట్టినరోజుకు వెళ్ళాలని వుంది.

"రామ్!" రాఘవ్ గర్జనతో ఉలిక్కిపడ్డాడు.

"నేను మళ్ళీ మళ్ళీ చెప్పనవసరంలేదు. అటువంటి వాళ్ళతో స్నేహం కష్టాలు తెస్తుంది"మందలించాడు రాఘవ.

మూడవనాటి సాయంకాలం పార్కులో కూర్చుని చదువుకుంటున్నాడు రాఘవ. అతనికి మధ్యలో రోజా గురుకు వచ్చింది. నిన్న వెళ్ళలేదు. ఏమనుకుందో ఏమో? లేకపోతే తినటానికి తిండిలేక మల మల మాడిపోతున్నారు జనం.

'ఇలాంటి కాలంలో ఈ ధనవంతులు తిన్నది అరగక బాధపడుతూ, యింకా పార్టీలు అంటూ వేలకి వేలు ఖర్చు పెడుతున్నారు. ఆ పార్టీ ఏదో తనలాంటి వాళ్ళ కివ్వక పోతే నలుగురు బీదవాళ్ళకి అన్నదానం కానీ, వస్త్రదానం కానీ చెయ్యరాదూ!'

"ఏమండీ" అన్న కంఠం వినిపించి గబుక్కున తల ఎత్తాడు. రోజా!

"నిన్న నా పుట్టినరోజుగదా ఎందుకు రాలేదండీ? వెయిట్ చేసి, చేసి అలసిపోయాను తెలుసా? నాన్నగారు కూడా అన్నారు - 'ఏమ్మా బేబీ అలాగవున్నావు' అని. యిదిగో స్వీట్సు తీసుకోండి!"

స్వీట్సు యిస్తూ అతన్ని చూసింది. ఆ చూపులకు రాఘవ కంగారుపడ్డాడు. "థాంక్స్" అన్నాడు సర్దుకుని.

"ఎందుకు రాలేదండీ మీరు?" బుంగమూతి పెట్టింది. ఏమిటేమో చనువు అనిపించింది రాఘవకు.

"ఇందాకే రామ్ కనిపిస్తే అడిగాను. మీకు జ్వరం వచ్చిందన్నాడు. ఇప్పుడెలావుంది?" ఆదుర్దాగా అడుగుతూ అతని చేయి పట్టుకుంది.

ఆమె చొరవకు నిర్ఘాంతపోయాడు రాఘవ. ఎంతో మంది అమ్మాయిలు తనకి చేరువగా వద్దామని చూశారు. కొందరు ధైర్యంగా ప్రేమలేఖలుకూడా వ్రాశారు. దేనికీ తను చలించక పోవటంతో 'ప్రవరాఖ్యుడ'ని పేరుపెట్టారు. కాని యిప్పుడీ రోజా ధైర్యం, చొరవ అతనికి ఆశ్చర్యం కలిగించాయి.

ఆమె చేయి తగలగానే అతనికి ఏదోలాగ అనిపించింది. ఒక్కసారి ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఏదో

భావన. ఏమిటో అతనికే అర్థం కాలేదు. 'వేడికి కరిగిపోతున్న మంచుముక్కా తను' అనిపించింది అతనికి. కంగారుగా చేయి విదిలించు కొన్నాడు.

"ఎందుకండీ అంత భయపడతారు? మీరు నిన్న వస్తారని ఎంతో ఆశతో ఎదురు చూశాను. మిమ్మల్ని చూసిన దగ్గరనుంచీ నే నేదో అయిపోతున్నాను" చనువుగా గబగబా మాట్లాడుతున్న రోజావంక తెల్లబోయి చూస్తుండి పోయాడు.

"ఏమి టీమె సిగ్గులేకుండా యిలాగ మాట్లాడుతున్నది అనుకుంటున్నారు కదూ? నేనంతే! కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడతాను. నువ్వంటే నాకు చాలాయిష్టం అయినప్పుడు అది నీకు తెలియపరచక నాలో నేనే దాచుకుని ఎందుకు బాధపడాలి?" గలగల నవ్వింది.

"నీ చూపులే చెప్తున్నాయి నేనంటే నీకిష్టమని. మనిద్దరం హాయిగా వుండాలి. ఈ లోకంలో ఏ జంటా లేనంత ఆనందంగావుండాలి మనిద్దరం. ఏం రాఘవా మాట్లాడవేం?" రాఘవను కుదిపింది రెండు చేతులతో.

అప్పుడేం మాట్లాడాలో అర్థం కాలేదు రాఘవకు.

"సరే ఆలోచించుకో. నేనంటే నీకిష్టమయితే రేపీ పాటికి యిక్కడకు వస్తాను. నీకు డైరెక్టుగా చెప్పడం యిష్టం లేకపోతే దాన్నిబట్టి తెలుసుకుంటాలే. వస్తా, నన్ను నిరాశ పరచకు" ముద్దుగా అంటూ వెళ్ళిపోయింది రోజా.

ఆడపిల్లలు సిగ్గు ఒలకబోస్తారనీ, మగపిల్లలే యిలాంటి ప్రేమవ్యవహారాల్లో ముందంజ వేస్తారనీ అంటారు. కాని ఇప్పుడు జరిగినదేమిటి? ఆమె చకచకా నిర్మొహమాటంగా

చెప్పేసింది. కాని తను?... నవ్వుకున్నాడు రాఘవ. తను... మారిపోతున్నాడా? ఎప్పుడూ, ఎవరినీ ఇంతగా పట్టించుకోని తను రోజా గురించి ఎందుకు ఆలోచిస్తున్నట్లు?

ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు. రోజాముఖమే కనిపించ సాగింది కళ్ళు మూసినా, కళ్ళు తెరచినా కూడా. అప్పు డనిపించింది తనుకూడా ఆమెను ప్రేమిస్తున్నానని! మర్నాడు పార్కుకు వెళ్ళాడు.

అలాగ పరిచయ మయింది రాఘవకు రోజాతో. అది నాలుగు సంవత్సరాలలో వృద్ధిచెందింది. ఈలోగా రాఘవ ఎమ్. ఎస్. సి. యూనివర్శిటీఫస్టు రావటం, రోజా బి. ఎస్. సి. పూర్తిచేయటం జరిగింది.

రోజా తన తండ్రికి రాఘవను పరిచయం చేసింది. కాని తమ ప్రేమవ్యవహారం బయటపెట్టలేదు. రాఘవకూడా రోజాతో అతిగా బయట షికార్లు తిరగటం లాంటివి చేసే వాడుకాదు. ఎప్పుడైనా పార్కులో కలుసుకొని ఒకఅరగంట మాట్లాడుకొనేవారు.

రాఘవ అక్కడనే లెక్చరర్‌గా చేరి ఒక సంవత్సరం అయింది. రామ్‌కూడా అదేకాలేజీలో లెక్చరర్ అయ్యాడు. ఒకప్రక్క రోజాతొందర, ఇంకొకప్రక్క తండ్రి శివరావు గారి ఒత్తిడి. రాఘవ నలిగిపోతున్నాడు.

తండ్రిగారి వూరినుంచి వచ్చిన రాఘవ గుమ్మంలో అడుగుపెట్టగానే చిన్నవదిన శాంత ఎదురువచ్చి "సీకోసం రెండుసార్లు వచ్చివెళ్ళాడు రామ్. రాగానే అర్జంటుగా పంపండి అన్నాడు" అంది.

గబగబా స్నానంచేసి కాఫీతాగి వెళ్ళాడు రామ్

యింటికి. ఆ రోజు ఆదివారం కావటంతో యింటివద్దనే వుంటాడు అనుకుంటూ వెళ్ళాడు.

బయట రోజా కారు. 'వోహ్! రోజా కూడా ఇక్కడే వుంది. రామ్‌తోనూ, రామ్‌భార్య దుర్గతోనూ మాట్లాడటానికి వచ్చి ఉంటుంది. బహుశా పెళ్ళిగురించే! అసలేం మాట్లాడుతుందో దుర్గతో? వినాలి' అనుకుంటూ మెల్లిగా, పిల్లిలా హాల్లోకి అడుగుపెట్టాడు రాఘవ.

గదిలోనుండి "ఎంత వంగనాచివే" ఒగరుస్తూ అంటున్న రోజామాటలు వినిపించాయి.

"రాఘవ పైకి ఎంత ఆదర్శవంతుడిలా వుంటాడు!" దుర్గ కంఠం అది.

"హా! చేసేవన్నీ గంగాస్నానాలు, దూరేవన్నీ దొమ్మరి గుడిసెలూ అని, మేకవన్నెపులి రాఘవ. ఛీ ఛీ" చీత్కరించింది రోజా.

"ఆయన్ని ఏమీ అనకండి..." ఆ పైన మాట్లాడలేకపోయింది సరోజ దుఃఖం ఆగక.

"సిగ్గులేకపోతేసరి, ఆయన్ని ఏమీ అనకూడదట, చెప్పవే నీకూ, రాఘవకూ ఎన్నాళ్ళనుండి పరిచయం, ఆ రాఘవముఖం ఈ జన్మలో చూడను. ఒకవైపు నీకు పిల్లాడిని కంటూ, నన్ను పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నాడా?" రోజా ఆడపులిలా గర్జిస్తోంది.

"నయం. ఆ డాక్టరమ్మ చెప్పబట్టి తెలిసింది. అసలు నాలుగు రోజులనుండి ఈ అమ్మాయి అన్నం కెలకటం, వాంతి చేసుకోవటం నాకు అనుమానంగానే వుంది. అందుకే

డాక్టరమ్మని పిలిపించి చూపించాను. తేలిపోయింది" దుర్గ అంటోంది.

"ఛీ. అసలు ఇటువంటి ఆడదాన్ని ఏం చేసినా పాపం లేదు" రాజం ఆవేశంతో అంటోంది.

ఇదేం గొడవ అనుకుంటూ గది గుమ్మంలోకి అడుగు పెట్టాడు రాఘవ. ఈలోగా రాజా, సరోజ చెంప చెళ్ళుమని పించింది. రాఘవ ఒక్క ఉదుటున వెళ్ళి రాజాను దూరంగా నెట్టాడు. ఒక్కనిమిషం రాఘవ రాజా ఒకరి నొకరు చూస్తూ నిలుచుండి పోయారు. నిప్పులు చెరిగే కళ్ళతో, అసూయగా రాజం చూస్తే, మొట్టమొదటి సారిగా రాజాను అసహ్యంగా చూశాడు రాఘవ. నిర్లక్ష్యంగా తల విదిలించుకుంటూ వెళ్ళి పోయింది రాజా.

"అన్నయ్యగారూ, అత్తయ్యగారికి ఇవన్నీ గిట్టవు. మీరుసరోజను ఇక్కడ వుంచడానికి ఆమె ఇష్టపడడంలేదు" దుర్గ అంది.

రాఘవ సరోజ వేపు చూశాడు. అవమానభారంతో తల క్రిందకి వంచుకుంది. నిలువెల్లా వణికిపోతోంది. బెదిరి పోతున్న లేడిలా తనవేపు చూసింది. ఆ పెద్దపెద్ద కళ్ళనిండా నీళ్ళు. ఎంతో బాధనిపించింది రాఘవకు. ఒంటరిగా, దీనంగా భయంతో వణికిపోతూ, అనాథగా నిలుచున్న ఆమెను 'నే నున్నాను రక్షణగా. భయపడకు సరోజా' అని బుజ్జగించాలని పించింది రాఘవకు. ఆమె కన్నీళ్ళు తన చేతులతో తుడవాలి అనిపించింది అతనికి. కాని పైకి "రా సరోజా" అన్నాడు బైటకు దారితీస్తూ.

ఆమె ముందుకు తూలబోయి తూలింది. ఒడుపుగా ఆమెను పట్టుకుని నెమ్మదిగా బయటకు వచ్చేశాడు రాఘవ.

"సారీ, రాఘవా! ప్రొద్దుట నేను ఇంటిదగ్గర లేనప్పుడు ఏదో గొడవ జరిగిందట!" అప్పుడే ఇంటికి వచ్చిన రామ్ కంఠం వినిపించడంతో తలపైకెత్తి చూశాడు.

"సరోజకు రెండవ నెలట!" కూర్చుంటూ మెల్లగా అన్నాడు రామ్.

చిన్నవదినా, పిల్లలూ సినిమాకు వెళ్ళడంతో రామ్ నిరభ్యంతరంగా చెప్పాడు.

సరోజా, దుర్గల మాటలను బట్టి అర్థంచేసుకుని ఉండటం వలన రాఘవకు కొత్త విషయంలా కనిపించలేదు. 'అసలు పిల్లలు కావాలి, కావాలి అనుకున్న వాళ్ళకు భగవంతుడు ఇవ్వడు. కాలుజారిన అమ్మాయిలకు, మగవాడి పశుబలానికి బలి అయిపోయిన స్త్రీలకు గర్భం వెంటనే వచ్చేస్తుంది? ఏమిటో ఈ జీవితాలు' అనిపించింది రాఘవకు.

"సరోజా, దుర్గా పాపం ఆ అమ్మాయిని ఒకటే సూటీ పోటీ మాటలు, నిజంగా ఈ ఆడవాళ్ళు హు! ఆపదలో ఉన్న సాటి ఆడదాన్ని ఎంత హీనంగా చూస్తారు వీళ్ళు! ఏదో మగవాళ్ళు మమ్మల్ని బానిసల్ని చేస్తున్నారు! హీనంగా చూస్తున్నారు, మా వ్యక్తిత్వం గుర్తించరు అంటూ యిదీ అది మాట్లాడతారు కాని, నిజంగా వాళ్ళే వాళ్ళకు శత్రువులు" రామ్ ఆగి రాఘవ వంక చూశాడు.

రాఘవ ఆలకిస్తూ కూర్చున్నాడు. తెల్లటి షర్టు, ప్యాంటూ, పచ్చగా, బలిష్టంగా టీవిగా ఉన్న రాఘవను చూడగానే "ఎంత అందగాడు" అనిపించింది రామ్‌కు. 'అసలు

అందమంతా కొనదేలిన ఆ ముక్కు, చురుకైన ఆ కళ్ళల్లోనే ఉంది. నల్లటి ఆ నొక్కు నొక్కుల జుట్టు ఎంత అందంగా ఉన్నది' అనుకున్నాడు రామ్.

తానే ఆడపిల్లయితే రాఘవచేత బలవంతంగా మెళ్లో తాళి కట్టించుకునేవాడే! లేదా తనే కిడ్నాపు! ఏమయినా యిది మహిళా దశాబ్దంకదా! నవ్వొచ్చింది రామ్‌కు తన ఆలోచనలకు.

అంతటి తీవ్ర పరిస్థితిలో కూడా నవ్వుతున్న రామ్‌ను ఆశ్చర్యంగా చూశాడు రాఘవ.

"ఇంతకీ యీ సరోజ యెవరు, రాఘవా?" ఎప్పటి నుండో అడగాలనుకుంటున్న ప్రశ్న టక్కున బయటకు వచ్చేసింది రామ్‌కు.

అసలు సరోజకూ, రాఘవకూ ఎలా పరిచయమయిందో రాఘవకు తెలియదు. ఒక్క రోజాతో తప్ప ఏ ఆడపిల్లతోనూ మాట్లాడడు రాఘవ. రోజా అందమైనదే కావచ్చు. కాని అలంకరణ వుంటేనే ఆమె అందంగా కనిపిస్తుంది! పొట్టిగా, పీలగా వుండే రోజాను రాఘవ ఒక్క చేత్తో పైకి ఎత్తేయగలడేమో అనిపిస్తుంది. సరోజ గులాబి రంగు ఛాయలో, నల్లటి బారెడు జడతో, యిటు పొడుగూ, అటు పొట్టీ కాకుండా, దానికితగ్గ లావుతో, గంభీరంగా వుంటుంది. చక్కటి అవయవ సౌష్టవం ముఖ్యంగా ఆ పెద్ద పెద్ద నల్లని కళ్ళతో ఎంతె అమాయకంగా చూస్తుంది! చిన్న నోరు, ఎర్రని పెదవులు.

"రామ్! రా బయటకు వెడదాం" రాఘవ మాటలతో రామ్ ఆలోచనలకు అంతరాయం కలిగింది. కొంపతీసి యీ

రాఘవ కానీ సరోజను ప్రేమించటం లేదుకదా! ఇంతకీ తన ఇంటినుంచి తీసుకెళ్ళిన సరోజను ఎక్కడ పెట్టినట్లు? ప్రశ్నార్థకంగా అనుమానంగా రాఘవవైపు చూశాడు రామ్.

"నీకూ్కడా నామీద అనుమానంగా ఉందా?" రామ్ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు రాఘవ.

"అబ్బే! అలాంటిదేం లేదు, కాని..." సందేహించాడు.

"నామీద నీకు నమ్మకం ఉన్నప్పుడు ఆ కాని, గీనీలు తీసేయిరామ్. ఇంక ఆవిషయాలేమీ యిప్పుడు ఎత్తకు" రాఘవ అన్నాడు.

కాస్సేపు కాలేజీ విషయాలు మాట్లాడుకుని స్నేహితులిద్దరూ విడిపోయారు.

ఆ రాత్రి రాఘవ మనస్సు అల్లకల్లోలంగా తయారైంది. 'తను పెద్ద వదినతో రెండు నెలల్లో పెళ్ళి చేసుకుంటానని చెప్పి వచ్చాడు. కాని ఇక్కడికి వచ్చిన తర్వాత జరిగిందేమిటి? ఎవరయినా ఏదైనా అన్నారంటే అర్థం ఉంది. నాలుగేళ్ళనుండి పరిచయముందండీ, ఆత్మీయురాలిలా ఉండే రోజా తననింతేనా అర్థం చేసుకుంది? అందులో ఇంకొన్నాళ్ళల్లో అర్ధాంగి కాబోతుందనుకున్న రోజా ఎంత అపార్థం చేసుకొంది! కష్టంలో ఉన్న సాటి ఆడదానిని ఎన్ని మాటలంది! ఇదేనా ఆమె చదువుకి సార్థకం? సంస్కారంలేని మనిషి. ఛీ' అనిపించింది రాఘవకు. ఆమె ముఖం తనే చూడకూడదు అనుకొన్నాడు.

"అక్కా! అక్కా! మామయ్యగారు వచ్చారు" గదిలో ముందర భాగంలో చదువుకుంటున్న పిల్లలు కర్రేను

వెనకాలకు వెళ్ళారు. ఆ పెద్దగదికి మధ్యన కొట్రెనుకట్టి వెనకాల వంటిల్లుగా, పడకగదిగా కూడా చేసుకొని, ముందరి వైపు రెండు కుర్చీలు, టేబుల్ అందంగా అమర్చింది సరోజ.

"రాఘవగారు వచ్చారా?" అంటూ ముందరి భాగం లోకి వచ్చింది. ఆమె సంతోషంగా ఉంది.

"ఏమిటలా అలసిపోయినట్లున్నారు. కూర్చోండి. కాఫీ తీసుకు వస్తాను" లోపలకు వెళ్ళింది సరోజ.

సరిగ్గా నెలయింది రాఘవ బొంబాయినుండి సరోజను తీసుకువచ్చి. అదే రోజున ఈ గదిచూసి అక్కడ ఉంటా మన్నాడు రాఘవ.

ఈ గదిలోకి వచ్చిన మర్నాడే సరోజకు గర్భ స్రావం అయింది. అది ఆమె అదృష్టం. ఆమెకు కావల్సిన వన్నీ అమర్చి కొంత పైకం, ఖర్చులకి ఇచ్చాడు రాఘవ. ఆ పైకం తీసుకునేటప్పుడు ఆమె ముఖంలో కనిపించిన అవ్యక్తమైన బాధను తను గమనించకపోలేదు. ఈ నెలలోనే ఆమె ఇరుగు పొరుగుతో మంచిగా వుండి వాళ్ళ పిల్లలకి ట్యూషన్లు చెప్పడం ప్రారంభించింది.

"కాఫీ తీసుకోండి" అన్న సరోజమాటలతో రాఘవ ఆలోచనలు ఆగిపోయాయి.

"సరోజా, నువ్వు కాలేజీలోచేరి చదవవచ్చుగదా! అలాగే నీ టైపూ, షార్టుహేండ్ నేర్చుకుంటూనే ఉండొచ్చు. గ్రాడ్యుయేట్ అయితే బాగుంటుంది." రాఘవ అన్నాడు.

ఏమిటీ! తనకు చదువా? అసలు తనకు చదువు బాగా వస్తుంది. స్కూల్ ఫైనల్ లో స్కూల్ ఫస్టు వచ్చింది. కానీ

తను చదవాలంటే ఖర్చులు ఎవరు భరిస్తారు? ఏదో యిప్పుడు మటుకు పదిమంది పిల్లలకు ట్యూషన్ చెబుతోంది. తరువాత యింకా యెక్కువమంది రాకపోతారా? తన పొట్టకి సరిపడా సంపాదించుకోగలదు. అసలు ఇలా జీవించి వుండటంలో అర్థం ఏమిటి? అలాగని చచ్చి ఎవర్ని సాధించాలి? సరోజ తలలో కోటి ప్రశ్నలు ఉదయించాయి. నెమ్మదిగా తల ఎత్తి అతనివైపుచూసి తలదించుకుంది. ఆమె కళ్ళల్లో కదలాడిన భావం పసిగట్టాడు రాఘవ.

"నువ్వు డబ్బుగురించి చింత పెట్టుకోవద్దు." రాఘవ మాట పూర్తి కాకుండానే చివ్వున తలపైకెత్తింది. "ఏదో రెండుపూటలా ఇంత తినేందుకు, ఒంటినిండా బట్టకొరకు సంపాదించుకోగలను. చింతఎందుకు? ఇక మీకు అనవసరంగా శ్రమ ఇవ్వదలచుకోలేదు. నాలుగైదిళ్ళలో వీణ నేర్పమంటు న్నారు. అదికూడా మొదలు పెడితే ఇంక బాధలేదు." మృదువుగా మాట్లాడుతున్నా ఆమె గొంతు స్థిరంగా పలికింది.

"ఏమిటి నీకు వీణవచ్చునా? నాకు చెప్పలేదేం?" అంటూ గబగబా వెళ్ళి ఆమె భుజాలు పట్టుకు కుదపాలని పించింది రాఘవకు. కాని ఆవేశాన్ని అణచుకున్నాడు. రోజాను ఎన్నోసార్లు అడిగాడు. వీణ నేర్చుకోకూడదా అని.

'అసలు పాటమీదే మోజులేదు. ఇంక వీణ ఏం నేర్చు కొంటాను?' అని నిక్కచ్చిగా అనేసింది రోజా.

ఈ రోజున రోజాకూడా తనకేం కాదుగా? "సరే నీ యిష్టం, నీకే దిష్టమనితోస్తే అలాచేయి. వస్తా!" గబగబా వెళ్ళిపోయాడు రాఘవ.

వెళ్ళిపోతున్న అతని వంకే చూస్తూ ఆలోచనలో పడింది సరోజ.

పాపం రాఘవకు తనని ఎలా వదలించుకోవాలో బోధ పడటంలేదు. చదువు ఎందుకు, వీణ పాఠాలు నేర్చుతాను అని అంటే సంతోషించా డన్నమాట. అంతేకాని పట్టుబట్టి చదివించడానికి ఒప్పించ కూడదూ? అసలు తన పిచ్చికాని అతనెవరు? తనెవరు? తనకెవరూ లేరు. హు!: పుట్టినప్పుడు ఒంటరిగానే పుడతాం. ఈ లోకంనుండి వెళ్ళేటప్పుడూ ఒంటరిగానే వెడతాం. మరి మధ్యకాలంలో తోడు కావాలని కోరుకోవటం దేనికో? అసలు జీవితం అంటే ఏమిటో?

"ఏమండీ బాగున్నారా సరోజగారు!" రాం మాట లకు ఉలిక్కిపడి వాస్తవంలోకి వచ్చింది సరోజ.

"ఏమిటి ఇలా వచ్చారు? కూర్చోండి" ఆహ్వానించింది మర్యాదగా.

"మీకు ట్యూషను లైమేమో" సందేహించాడు రామ్.

"అబ్బే! అదేంలేదు లెండి. ట్యూషను ఉన్నా లేక పోయినా వాళ్ళు ఇక్కడే కూర్చొని చదువుకుంటారు." సరోజ అంది.

"మొన్న రాఘవతో వచ్చినప్పుడే మిమ్మల్ని క్షమించమని అడుగుదామను కొన్నాను. ఆ రోజు మా ఆవిడ, రోజా మిమ్మల్ని నొప్పించి ఉంటారు. క్షమించండి. రాఘవను రోజా అపార్థం చేసుకుంది. రాఘవకు కోపం వచ్చింది. వాళ్ళిద్దరిమధ్య ఉన్న అపోహలు, అపార్థాలు తొలగించి రోజా, రాఘవల వివాహం చేయాలని నా

సంకల్పం. రాఘవ నా ప్రాణస్నేహితుడు. ఏదో తాత్కా-లిక కోపంతో సరోజాకు దూరంగా ఉంటున్నాడు కాని, లేక పోతే సరోజా అంటే అతనెంత ఇష్టపడ్డాడని! ఈ విషయంలో మీ సహాయం అవసరం." రామ్ ఆశగా సరోజవైపు చూశాడు.

"నేనేం చేయాలి?" యాంత్రికంగా అడిగింది సరోజ. ఆమె మనస్సంతా ఏమిటో గజిబిజిగా ఉంది.

"సరోజాను ఇక్కడకు తీసుకువస్తాను. రాఘవతో మీకు ఏమీ సంబంధం లేదనిచెప్పండి. అంతేకాదు. అవసర మైతే మీ గత జీవితం గురించికూడా చెప్పండి."

రామ్ మాటలకు సరోజముఖం కోపంతో ఎర్ర బడింది. కాని అంతలోనే తమాయించుకుంది. రాఘవ సుఖంగా ఉండడమే తనకు కావలసింది. ఆయన ప్రేమించిన అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలి. తన వలన ఆయన జీవితం గాలిపటం కాకూడదు.

"రాఘవగారికీ, నాకూ ఎట్టిసంబంధం లేదని చెప్పే టప్పుడు నా వ్యక్తిగత విషయాల ప్రసక్తి ఎందుకు? అసలు నేను చెప్పింది నమ్ముతుందా ఆమె?"

"నమ్మేలెండి. సరోజాకు తొందరెక్కువ. ఏదో ఒకటి ఎవ రైనా అన్నా మీరు పట్టించుకోకండి రాఘవకోసం."

ఆమె సమాధానంకోసం ఎదురు చూడకుండానే వెళ్ళిపోయాడు రామ్.

ఆరోజంతా సరోజకు ఒక్కటే ఆలోచనలు. ఇదీ అని చెప్పలేని దిగులు. ఆ రాత్రంతా ఆమెకు నిద్రపట్టలేదు.

మర్నాడు ప్రొద్దుట పిల్లలకు ట్యూషను చెబుతోంది.

ఎంత మనసు బాగా లేకపోయినా, చేయవలసిన పని చేయక తప్పదు కదా! పిల్లలకు సక్రమంగా పాఠాలు చెబితేనే కదా ఫీజు తనకు ముట్టేది?

ఆటో రిక్షా చప్పుడుకు ఆలోచనలనుండి తేరుకుని తలెత్తింది సరోజ. రాఘవ రిక్షాలోంచి దిగుతున్నాడు. ఆటో రిక్షా అతను ఏదో సామాను పట్టుకు వస్తున్నాడు. ఏమై ఉంటుందా అని పరీక్షగా చూసింది సరోజ. ఆశ్చర్యంగా అలాగే చూస్తుండి పోయింది.

"ఏమిటి అలా చూస్తున్నావు? ఏం తెచ్చానో చెప్పకో చూద్దాం!" రాఘవ ప్రశ్నించాడు. ఎందుకో రాఘవ చాలా ఉత్సాహంగా కనిపించాడు సరోజకు.

"వీణ ఎందుకూ?" తెల్లబోతూ అడిగింది.

"వ్రాః...!" వెక్కిరింతగా అన్నాడు.

"ఎందుకండీ, ఇప్పుడింత డబ్బుపెట్టి కొన్నారు?"

"పంతులమ్మగారు మీరు. వీణ నేర్పుతాను అన్నారు. వీణ లేనిదే ఎలా నేర్పుతారు? అందుకే పట్టుకు వచ్చాను."

"దీనికి చాలా ఖర్చయి ఉంటుంది! మీకు నెలకు కొంత డబ్బు చొప్పున తీర్చేస్తుంటాను అయితే."

అతను తన కోసం అంతడబ్బు ఖర్చుపెట్టి తెచ్చాడని లోపల సంతోషంగా ఉన్నా, అతని డబ్బు తినడానికి తన కేం అర్హత ఉన్నదని అలా అంది.

"అసలు వాయిదాల పద్ధతి మీదే కదా వీణ తెచ్చింది? అలాగే ఇద్దువుగానిలే!" డబ్బు తీసుకోనంటే అపార్థం చేసుకుంటుందేమోనని అన్నాడు రాఘవ.

"డబ్బు తీసుకోవట మేమిటి? నీ కోసం తెచ్చాను"

అంటాడేమోనని ఎదురు చూసిన ఆమె మనస్సు ఒకసారి దెబ్బ తింది. లేకపోతే అతను తనకోసం ఎందుకు ఖర్చు పెట్టాలి? అతను రోజా భర్త కాబోతున్నాడు. ఆ ఆలోచన రాగానే ఆమె హృదయంలో యేదో ముల్లులాంటిది గుచ్చుకున్నంత బాధ ప్రారంభమైంది. కాఫీ తీసుకువచ్చే నెపంతో లోపలికి వెళ్ళింది.

"సరోజా! నీవు నాకు వీణ వాయించి వినిపించవూ?" కాఫీ తీసుకుంటూ చిన్నపిల్లాడిలా అడిగాడు రాఘవ. తను అడిగిన పద్ధతి తనకే ఆశ్చర్యం కలిగించింది. ఇంతవరకు తనెవరితోనూ ప్రాధేయపడుతున్నట్లుకాని, చిలిపిగా కాని మాటాడి ఎరగడు. కనీసం రోజాతో కూడా

"ఇంకోసారి ఎప్పుడో అలాగే వినిపిస్తాలెండి!" ముభావంగా అంది సరోజ.

వీణ తెచ్చినందుకు సంతోషిస్తుం దనుకున్నాడు. సరోజ నిర్లిప్తంగా ఉండిపోయే సరికి రాఘవకు బాధ కలిగింది.

"వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

సరోజ వీణ చూస్తూ ఉండిపోయింది. పిల్లలకు ట్యూషన్ చెప్పేందుకు మనస్సు బాగోలేక పోవడంతో వాళ్ళను పంపించేసింది.

"ఏమండీ సరోజగారూ! ఏంచేస్తున్నారు?" రామ్ వస్తూనే ప్రశ్నించాడు పలకరింపుగా.

అతని పక్కనే రోజా ఉంది. రోజా కళ్ళలో ఎక్కడలేని ద్వేషం గూడు కట్టుకుని ఉన్నది.

సరోజ భయంతో వణికిపోయింది. అసలు తనెందుకు భయపడాలి? తనకు తానే ధైర్యం చేసుకుంది.

"రండి కూర్చోండి!" ఆహ్వానించింది సరోజ.

"కూర్చో డానికేం గాని, రాఘవ నీకేమవుతారు ?" రోజా తీక్షణంగా చూస్తూ ప్రశ్నించింది.

ఉలిక్కిపడింది సరోజ. రోజా అటువంటి ప్రశ్న వేస్తుందని ఆమె అనుకోలేదు.

రామ్ కూడా తికమక పడ్డాడు. అసలు సరోజ ఎవరో. రాఘవకు ఆమెతో ఎలా పరిచయం అయ్యిందో రామ్‌కు తెలియదు. రాఘవ ప్రియ మిత్రుడు తను. తనకే రాఘవ ఆ విషయాలు చెప్పలేదు. అలాంటిది ముక్కు, మొహం తెలియని రోజాకు సరోజ చెపుతుందా ?

"సరోజా! కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టండి" రామ్ అడిగాడు.

ఆమె లోపలికి వెళ్ళగానే -

"నీకేం చెప్పాను? అలాంటివన్నీ అడగకూడదు అని చెప్పలేదూ?" రోజా చెవి దగ్గర మెల్లగా అన్నాడు.

దాంతో రోజా కొంచెం తగ్గింది.

మంచినీళ్ళ గ్లాసుతో సరోజా తిరిగి వచ్చింది.

"సరోజా! నీకు అన్నీ తెలుసుకదా? నేనూ రాఘవా కాబోయే భార్యాభర్తలం. నేనింత నిక్కచ్చిగా చెపుతున్నానని ఏమనుకోకు. నీకేం సహాయం కావాలన్నా చేస్తాను. కాని నువ్వు ఒక్కమాట ఇవ్వాలి." రోజా అడిగింది.

'ఏమిటి' అన్నట్లు చూసింది సరోజ.

ఈమెకూడా రాఘవలాగే కళ్ళతో చక్కగా

మాట్లాడగలదు. ఎంత చక్కటి కళ్ళు. అనుకోకుండా ఆమె అందాన్ని మెచ్చుకుంది రోజా మనసులోనే.

"నీకు కావలసినంత ధనం ఇస్తాను. అది తీసుకుని రాఘవకు కనిపించకుండా వెళ్ళిపో. రాఘవకు ఇలాగ నేను వెళ్ళిపోమ్మన్నానని చెప్పకూడదు" రోజా సమాధానం కోసం ఆగింది.

రామ్ గతుక్కుమన్నాడు. ఏమిటి రోజా కోరేది? శుద్ధ తప్పు కదూ ?

"రోజా ..." వారించబోయాడు రామ్.

"నీకేం తెలియదు రామ్! నువ్వూర్కుకో!" విసుక్కుంది రోజా.

సరోజ మనసు పరిపరి విధాల పోయింది. తనేం అపకారం చేసింది రోజాకు. తనెందుకు వెళ్ళిపోవాలి? తను వెళ్లిపోవడానికీ, రాఘవ పెళ్ళికీ సంబంధం ఏమిటి ? రాఘవ తన ప్రాణాన్ని కాపాడాడు. తనకు రక్షణ ఇప్పుడు అతనే కదా అతనికి తెలియకుండా ఎలాగ వెళ్ళిపోవాలి? ఎక్కడకు వెళ్లిపోవాలి ?

"నేను రెండు రోజులు టైం ఇస్తున్నాను. వెళ్ళిపో. నాగురించే కాదు, రాఘవ సుఖంగా సంతోషంగా ఉండాలంటే నువ్వు వెళ్ళిపోవాలి సరోజా! ఈ విషయం లేశమైనా రాఘవకు తెలియకూడదు! రాఘవ మీద ఒట్టేసి చెబుతున్నాను. నీకు డబ్బులు రాత్రికి కాని, ఎల్లుండికి కాని రామ్ చేత పంపుతాను. తీసుకొని వెళ్ళిపో. నడు రామ్" అంటూ విసవిసా వెళ్లిపోయింది రోజా.

నీరసంగా కూర్చుండి పోయింది సరోజ.

# 2

మర్నాడు ఉదయం ఆదివారం కావటంతో మార్కెట్టుకుపోతూ సరోజ ఇంటికి వచ్చాడు రాఘవ.

సరోజ ముఖం ఇరవై లంఘనాలు చేసినంత పీక్కుపోయింది.

ఆ ముఖం చూస్తూనే ఆత్రంగా అడిగాడు రాఘవ.

“సరోజా, వంట్లో బాగాలేదా?”

“కొద్దిగా తలనొప్పి అంతే!” ముభావంగా అంది సరోజ.

“డాక్టరు దగ్గరకు వెడదాం త్వరగా తయారవు.” ఆందోళనగా అన్నాడు రాఘవ.

“వద్దండీ నీరసంగా ఉంది” సరోజ.

“ఏమిటి సరోజా! ఒంట్లో అంత బాగాలేదా? మాట కూడా రావటంలేదు. జ్వరంగావుందా?” అంటూనే దగ్గరకు వచ్చి చెయ్యిపట్టుకు చూశాడు. అతనికి మొట్ట మొదట రోజా చెయ్యిపట్టుకోవడం గుర్తుకు వచ్చింది. తరువాత తనెప్పుడు ఇంతవరకు రోజాని తాకలేదు. సరోజను ముట్టుకోగానే మళ్ళీ అదేరకం షాక్ కొట్టి ఆరోజు రోజాఅంటే ఇష్టం చేత అలాగా అయిందనుకున్నాడు. కాని ఇప్పుడు! ఏదో

తెలియని అనుభూతి! ఒళ్ళంతా గగుర్పాటు! వెంటనే చేయి వదిలేశాడు. సరోజ ముఖంవైపు చూశాడు.

సరోజ బుగ్గలు కెంపుతో ఎరుపెక్కాయి. కళ్ళు సిగ్గుతో వాలిపోయాయి. ఆమెకుకూడా అదే అనుభూతి కలిగి ఉంటుందేమో! ఆ గిరిజాన గోజాకు ఏ అనుభూతులు లేవా? ఆమె బుగ్గలు ఇలా ఎందుకు ఎరుపెక్కలేదు? ఎందుకు కళ్ళు సిగ్గుతో వాలిపోలేదు? స్త్రీకి సిగ్గే సింగారం అనిపించింది. సరోజను చూడగానే. గోజా ఎప్పుడైనా ఇలా సిగ్గు పడిందా? అసలు ఆమె ఎప్పుడూ సిగ్గుపడ్డట్లు కనిపించ లేదు. తన్మయత్వంతో సరోజ వదనాన్ని తిలకిస్తూ ఉండి పోయాడు రాఘవ.

"నే నొక ప్రశ్న అడుగుతాను సమాధానం చెప్తారా?" సరోజ ప్రశ్నకు ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు రాఘవ.

"చెప్పవచ్చేది అయితే చెపుతాను" అన్నాడు రాఘవ. అతని మనస్సులో అనేక ఆలోచనలు. 'నన్ను ఏం చేద్దామనుకుంటున్నారు? నేనంటే ఎందుకు మీకు ఇంత ఇది' అలాటి ప్రశ్న లేవో ఆమె వేస్తుందనీ దానికి తను చక్కటి సమాధానం చెప్పాలను కొన్నాడు.

"తప్పకుండా సమాధానం చెప్పాలి. గోజాను పెళ్ళి చేసుకోవడానికి ఎందుకాలస్యం చేస్తున్నారు? మీవాళ్ళు, ఆమెవాళ్ళుకూడా ఇష్టపడ్డారు కదా...?" ఆమెకు తెలియదు వాళ్ళ పెద్దవాళ్ళకీ విషయం తెలియదని.

ఇదా సరోజ ప్రశ్న అనిపించింది అతనికి.

"పెద్దవాళ్ళు ఇష్టపడేది, పెళ్ళిచేసుకునేవాళ్ళు?..."

సరోజమాట పూర్తికాకుండానే మధ్యలో ప్రశ్నించాడు రాఘవ.

"అయితే మీకిష్టంలేదా?" ఆశ్చర్యంతో సరోజ కళ్లు ఇంకా పెద్దవయ్యాయి.

ఆ కళ్ళలో చెప్పలేని ఒక వింత కాంతి తళుక్కున మెరిసి మాయమయింది.

ఆ కాంతిచూసిన రాఘవ హృదయం సంతోషంతో గంతులేసింది. సరోజ అయస్కాంత మయితే తను ఇనుములా ఆమెకు ఆకర్షింప బడ్డాడా? ఇంత వరకూ తను ఎవరి చుట్టూ తిరగలేదు. రోజాచుట్టు కూడా తనెప్పుడూ తిరగలేదు.

'ఏమిటిది? ఎప్పుడూ నిష్కల్మషంగాఉండే మనస్సెం మలినమవుతోంది. ఆమె గర్భిణీకావటం, గర్భస్రావ మవట మవ్వీల్లు చూసిపెట్టడం నీకు తెలీదా ఆమె మనస్సు ఎవరి మీదున్నదో? ఆమె సుఖంకోరే వాడివయితే ఆమె మెచ్చిన వాడిని, ఆమెకు నచ్చినవాడిని తీసుకునచ్చి పెళ్ళి చెయ్యి.' అతనికి వివేకం బోధించింది.

"అయితే నువ్వు నా వ్యక్తిగత విషయాలు అడుగు తున్నావు కదా. నీ వ్యక్తిగత విషయాలు ఎప్పుడైనా చెప్పావా? నీ గురించి చెప్తే నా కథ విప్పుతాను." ఇప్పుడే ఈ క్షణంలోనే ఆమె జీవితం తెలుసుకుందా మనుకున్నాడు రాఘవ.

"అవన్నీ అలా వదిలేయండి కాని నేను సుఖంగా ఉండటం మీ కిష్టమే కదా?"

"అదేమిటి అలాగ అడుగుతున్నావు?" అన్నాడు పైకి. మనస్సులో మాత్రం 'నీ కోసం నన్నేం చేయమంటావు

సరోజా! నిన్ను చూస్తే అదేదో ఆత్మీయత. దానికి అర్థ మేమిటో చెప్పలేక పోతున్నా' అనుకున్నాడు.

"ఏం లేదు! మీరు త్వరలో రోజాను వివాహం చేసుకోవాలి." మాటలు నచ్చచెప్పుతున్నట్లు చెప్తున్న సరోజ వంక నిదానంగా చూశాడు రాఘవ. అతని చూపు లకు తట్టుకోలేక తల దించుకుంది సరోజ.

"రోజా తరఫున వకాల్తా తీసుకున్నావా?" రాఘవ అడిగాడు.

"కాదు నా సుఖంకోసం" తడబడుతూ అంది.

'నా సుఖంకోసం' అన్న సరోజ జవాబుకు రాఘవ మనస్సు దెబ్బతిన్నట్లయింది. అసలు తను రోజాను పెళ్ళి చేసుకోవాలని సరోజ ఎందుకు పట్టుబట్టాలి? రోజా వచ్చి సరోజను ప్రాధేయ పడలేదుగదా!' అన్న ఆలోచన రాక పోలేదు రాఘవకు.

"నేను పెళ్ళి చేసుకుంటే నువ్వు సుఖపడతావా? అలాగయితే ఎవరినో ఒకరిని చూసి పెళ్ళి చేసుకుంటానులే" ఏమంటుందోనని సరోజ ముఖంలోకి చూశాడు.

"ఎవరినో ఒకరినికాదు, రోజానే చేసుకోవాలి." తల వంచుకొని మాట్లాడుతున్న సరోజ ముఖ కవళికలు రాఘవకు కనిపించలేదు.

"సరే! నేను రోజాను చేసుకుంటే నువ్వు సుఖపడే ట్లయితే తప్పకుండా రోజాను చేసుకుంటాను" తల దించుకుని అన్నాడు రాఘవ.

ఆ సమయంలో సరోజా కళ్ళల్లో బాధ సుళ్లు తిరిగింది

తల వంచుకుని కూర్చున్న రాఘవ, ఆ బాధను చూసి ఉంటే పరిణామ మెలా ఉండేదో!

'నిన్నెవరైనా ఏదైనా అన్నారా?" తన పెళ్ళికి, ఆమె సుఖానికి సంబంధం ఏమిటో తెలియక రాఘవ అడిగాడు.

ఆమె ఒక్కసారి కళ్ళు పైకెత్తి చూసి తల దించుకుంది.

"సరోజా! ఎవరైనా ఏదైనా అంటే పట్టించుకోకు" అనునయంగా అన్నాడు రాఘవ.

"మీరు తప్పకుండా సరోజాను పెళ్లి చేసుకోవాలి. నేనెక్కడున్నా కోరేది మీ సుఖ సంతోషాలే." భారంగా పలికింది సరోజ కంఠం.

"ఏమిటి డైలాగులు వల్లెవేస్తున్నావు ? ఇప్పుడు నా సుఖానికి ఏమిటి లోటు, నువ్వెక్కడైనా ఉండటమేమిటి? ఇక్కడే వుంటావు. నీకు నచ్చిన వాడిని, నువ్వు కోరుకున్న వాడిని తెచ్చి అతని చేతిలో పెట్టేదాకా ఇక్కడే ఉంటావు" వత్తి పలికాడు రాఘవ. కనీసం ఇప్పుడైనా ఆమెగత చరిత్ర చెప్పి ఆమె ప్రియుడెవరో చెబుతుందనుకున్నాడు.

'ఏమయింది సరోజా నీకు? ఎందుకంత బాధ ? ఏమయినా బాధ కలిగించే మాట అన్నానా నేను?' అందామనుకుని ఆమె ముఖం చూసి ఆగిపోయాడు.

ముఖమంతా ఎర్రబడింది. చెమట పట్టింది! పాపం ఆమె ఇది వరకే ఎవరినో ప్రేమించిఉంటుంది. అతను మోసం చేసి ఉంటాడు. లేక పరిస్థితులు వాళ్ళను విడదీశాయో! ఏవేవో ఆలోచనలు వచ్చాయి రాఘవకు.

"సారీ రాఘవగారూ. కాఫీ తీసుకువస్తానుండండి" సరోజ లోపలకు వెళ్ళింది.

పిచ్చిపిల్ల. నవ్వుకున్నాడు చిన్నగా.

"నీకు మార్కెటునుంచి ఏదైనా కావాలా నేను అటే వెళుతున్నాను" కాఫీ త్రాగుతూ అడిగాడు.

"ఏం అక్కరలేదు."

"సరే వస్తాను. నువ్వు వెర్రివెర్రి ఆలోచనలు పెట్టుకోకు. పరిస్థితులన్నీ చక్కబడతాయి. దేనికైనా కాలం కలసి రావాలి. తొందరపడకూడదు. రేపు మళ్ళీ కలుస్తాను."

ఖాళీ కప్పు క్రింద పెట్టి వెళ్ళిపోయాడు రాఘవ. అతను కనిపించినంత వరకూ చూసి లోపల కెళ్ళిపోయింది సరోజ. అంతవరకు నిగ్రహించుకుంది. కాని ఇక ఆగలేక వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమెకీ, రాజాకీ మధ్య జరిగిన సంభాషణంతా రాఘవకు చెప్పాలను కున్నది. కాని రాజా రాఘవ మీద ఒట్టు వేసిందే! ఈ ఒట్టు విలువ ఎంత తగ్గిపోతున్నా ఆత్మీయుల మీద ఒట్టు అనేసరికి సందేహిస్తుంటాము. అందుకే రాఘవకు సరోజ ఏమీ చెప్పలేకపోయింది.

## 3

"రాఘవా! సరోజ ఎక్కడికి వెళ్ళిందో ఏమైనా తెలిసిందా" రామ్ అడిగాడు.

'తెలీలేదు'' ముక్తసరిగా అన్నాడు రాఘవ. అసలే ముభావంగా ఉండే రాఘవ ఆనాడు మరీ గంభీరంగా కనిపించాడు. అది రోజా వల్లనో, సరోజ వల్లనో అర్థంకాలేదు రామ్‌కు. ఆలోచనలతో రాఘవ బుర్ర వేడెక్కి పోయింది. సరోజ ఎందుకు వెళ్ళిపోయింది? ఆనాడు, పదిహేను రోజుల క్రిందట తాను వెళ్ళినప్పుడు 'నేనెక్కడున్నా మీ సుఖ సంతోషాలే ఆశించేది' అన్న సరోజ మాటలకు అర్థం ఇదన్న మాట! అప్పుడు తనకు బోధపడలేదు. ఆ మర్నాడు తను ఆమె ఇంటికి వెళ్ళగా తాళం వేసి ఉంది. ప్రక్కింటబ్బాయి పరుగెత్తుకుంటూ వచ్చి చీటీ ఇచ్చాడు. 'ఇది సరోజక్క మీ కిమ్మంది' అంటూ, గబగబా చీటీ విప్పి చదవడం ప్రారంభించాడు.

“రాఘవగారూ! క్షమించండి. మీకు చెప్పకుండా వెళ్ళిపోతున్నందుకు. పుట్టినప్పుడే ఈ జీవితమనే రైలుబండి ఎక్కాం. మరణమనే స్టేషను చేరుకునే వరకూ పోరాటం తప్పదు మనిషికి. రైలుబండి లాంటి జీవితంలో ఒక్కో మనిషికి ప్రయాణం సౌకర్యంగా సాగిపోతుంది. ఈ ప్రయాణం ఒక సరదాగా తీయనిఅనుభూతులతో నిండి, స్టేషను రాకుండా ఉంటే బాగుండును అనిపిస్తుంది అలాంటి వాళ్ళకు. అలాంటి వాళ్ళు స్టేషను దగ్గర పడుతున్న కొద్దీ భయపడతారు. స్టేషను వచ్చేస్తుందేమోనని భయపడతారు. స్టేషను వచ్చేస్తుందేమో నని వాళ్ళభయం. వాళ్ళు సాధ్యమైనంతలో సుఖానికి అంతరాయం కలగకుండా చూచుకుంటుంటారు. కొందరికి కాసేపు అసౌకర్యంగా వున్నా, కాసేపు సుఖంగా ఉంటుంది. అది ప్రయాణపు మొదటి భాగం కావచ్చు. ఎప్పుడో ఒకప్పుడు

సుఖపడతారు. కాని ఇంకో తరగతి వాళ్ళున్నారు. వాళ్ళు పట్టి దౌర్భాగ్యులు. వాళ్ళకు మొదటినుండి చివరివరకూ ప్రయాణం అసౌకర్యంగానే ఉంటుంది. అంతేకాదు, ప్రక్క వాళ్ళ అదలింపులతో, చీత్కారాలతో నిల్చునేందుకు చోటుకూడా లేకుండా వాళ్ళు ఉసూరుమంటూ సాగిస్తారు ప్రయాణాన్ని. అలాంటి వాళ్ళకు స్టేషను ఎంత త్వరగా వస్తుందా, దిగిపోదామా అనిపిస్తుంది. ఈ ఆఖరి కోవకు చెందిన దౌర్భాగ్యుల్లో నేనొకదాన్ని. నావంటి అభాగ్య రాలి కోసం ఆలోచిస్తూ మీ కాలాన్ని వృధా చేయకండి. మీరు హాయిగా ఉండాలి.

—సరోజ.

ఆ చీటీ చదువుకున్నప్పటి నుంచి ఎన్నోసార్లు అను కున్నాడు తను. ఇంత చిన్న వయసులో అంత వైరాగ్యం రావడానికి ఆమె ఎదుర్కొన్న పరిస్థితులేమిటో అని.

"నువ్వు రోజూకు కనిపించడమే మానివేశావట. ఎంత బాధపడుతున్నదో తెలుసా. తప్పక ఒకసారి కలుసుకో. జీవి తంలో కొన్ని విషయాలలో ఆలస్యం మంచిదికాదు. ఈవేళ సాయంత్రమే ఆమెను కలుసుకోవాలి. రాఘవా! నామాట విను. లేకపోతే నా మీద ఒట్టే." రామ్ అర్థిస్తున్నట్లు మొదలుపెట్టి ఒట్టుకూడా పెట్టి బెదిరించాడు ఆఖరికి.

రామ్ మాటలతో మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాడు రాఘవ.

రామ్ తప్ప తనకుఎవరున్నారు అంత మంచి స్నేహి తులు. రోజా నాలుగైదుసార్లు కబురు చేసిందా మధ్య ఒక సారి వచ్చి కలుసుకోమని. తను నిర్లక్ష్యం చేశాడు. ఇదివర

కెప్పుడైనా చికాకుగా ఉంటే సరోజా దగ్గరకు వెళ్ళేవాడు. కాని ఇప్పుడు ఎంత మనసు బాగాలేకపోయినా వెళ్ళాలని పించడంలేదు! సరోజ తనతో చెప్పకుండా ఎందుకు వెళ్ళి పోవాలి? ఆమెకు తనేం అపకారంచేశాడు? అసలు సరోజ గురించి తనింత బాధపడటం దేనికి? ఆమె చెప్పినట్లు రైలు బండిలో ఎంతోమంది ప్రయాణీకులు తారస పడుతుంటారు. చోటులేక నిలబడినవారికి కూర్చోమన్న కొందరు ఉదారులు చోటిస్తారు. ఇష్టమున్నవాళ్ళే కూర్చుంటారు. లేదా అప్పటికి మట్టుకు కూర్చుని ఉండకా సౌకర్యంగా ఉన్న చోటు దొరికి నంతే అక్కడకు వెళ్ళిపోతారు. ఈ జీవితంకూడా అంతే! సరోజకు ఇంకో చోటు దొరికితేనా సుఖంగా ఉంటే ఉంటుంది. ఎందుకే వెళ్ళిపోయిందేమో? జీవితంలో ఎంతో మంది తారస పడుతుంటారు. కొందరు సహాయం అర్థిస్తారు కూడా. వీలైతే సాయం చేస్తాం. అంతమాత్రంచేత వాళ్ళ వ్యక్తిగత విషయాలలో తలదూర్చటం అవివేకం. అలాగని ఎంత సరిపెట్టుకుందామనుకున్నా సరోజ విషయంలో అది సాధ్యం కావటంలేదు. "ఏమిటి రాఘవా! ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటావు? నేను నిన్న సరోజాకు వాగ్దానం చేశాను. నిన్ను రేపు తన ఇంటికి పంపుతానని. వెడతావు కదూ?"

రామ్ ప్రాధేయ పూర్వకంగా అడిగాడు.

రాఘవ ఆలోచనలనుండి తేరుకునితలదించుకున్నాడు.

"తప్పకుండా వెళ్ళాలి రాఘవా! నేను నీ ప్రాణ స్నేహితుడనని నీవనుకుంటే తప్పక వెళ్ళాలి" రామ్ మళ్ళీ అన్నాడు.

రామ్‌కు ఎలాగైనా రాఘవ, సరోజాల పెళ్ళి తొందరగా జరిపించెయ్యాలని ఉంది. ఉభయుల వివాహం జరిగిపోతె, ఇక సరోజ అడ్డు ఉండదు. అతనికి సరోజమీద మంచి అభిప్రాయం లేదు. ఆమె గతచరిత్ర ఎటువంటిదో ఎవరికీ తెలియదు. రాఘవమీద గౌరవంకొద్దీ సరోజను తన ఇంట్లో కొన్నాళ్ళు అట్టే పెట్టుకున్నాడు. ఆమె అతనింట్లో వున్నన్నాళ్ళూ చాలా గౌరవంగానే ప్రవర్తించింది. కాని పెళ్ళి కాకుండా గర్భవతి అయిందంటే, ఆమె జీవితంలో కొంత చెడు ఉండవచ్చు అనుకున్నాడు రామ్. ఆమె మళ్ళీ ఎక్కడైనా రాఘవకు కన్పిస్తుందేమోననీ, ఆమె ఆకర్షణకూ, అందానికీ రాఘవ లొంగిపోతాడేమోనని రామ్ భయం.

"వెళ్తావు కదూ?" మళ్ళీ అడిగాడు రామ్.

"సరే" అన్నాడు రాఘవ.

హమ్మయ్య అనుకున్నాడు రామ్.

"సరే నేను వస్తాను" అంటూ రామ్ వెళ్ళిపోయాడు.

తరువాత సరిగా ఆలోచిస్తే సరోజా పెద్ద తప్పేం చెయ్యలేదనిపించింది. తన నెంతో ప్రేమించింది కాబట్టి సరోజ మీద ఈర్ష్య చెంది ఉంటుంది. తనని అపార్థం చేసుకుంది. ఇన్నాళ్ళూ తను ఇంత చిన్నవిషయంలో పట్టింపులకు సరోజాను చూడకుండా ఎలాగ ఉండగలిగానా ననుకున్నాడు. తప్పకుండా సరోజా దగ్గరకు వెళ్ళి అపార్థాలన్నీ తొలగించి సరోజను పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు.

ఆ సాయంకాలం సరోజాఇంటికి వెళ్ళాడు.

"హా! రాఘవా! ఎన్నాళ్ళకి? అబ్బ నా కెంత సంతో

షంగా వుందో!" చిన్నపిల్లలా గెంతుతూ ఎదురు వచ్చిన రోజాను చూసేసరికి రాఘవ మనస్సు ఉల్లాసంతో పొంగింది.

రాఘవ లోపలికివచ్చి కూర్చోగానే వంటమనిషి కాఫీ తీసుకువచ్చి ఇచ్చింది.

"రాఘవా! ఎన్నాళ్లు ఇలాగ చెప్పు!" గారాం పోయింది రోజా.

"నాన్నగారూ, అందరూ ఒప్పుకున్నారు. నీ ఒక్కడిదే ఆలస్యం. నువ్వు సరే అను రాఘవా! వచ్చేనెల మొదటి వారంలో పెళ్ళి అయిపోతుంది. మంచి ముహూర్తా లున్నాయట. నువ్వు 'వూ' అనకపోతే నాన్నగారు నన్ను ఎవరికైనా ఇచ్చి పెళ్ళి చేసేస్తారు చూసుకో."

రోజా ఇంకా సరోజగురించి అడుగుతుందని, ఆమెకు జరిగిందంతా చెప్పి అపార్థాలు తొలగించాలని అనుకున్న రాఘవకు రోజా మాట్లాడే పద్ధతి చూస్తే ఆశ్చర్యమనిపించింది. ఆమె అసలు సరోజ విషయమే ఎత్తలేదు. పిల్లలా ఆ విషయాలన్నీ మరచిపోయి నిర్మలంగా మాట్లాడుతోంది. తనలో అనుకున్నాడు. అటువంటప్పుడు సరోజ విషయం తను మాత్రం ఎందుకు ఎత్తాలి?

"వూం అనూ!" రోజా మారాం చేసినట్లుంది.

"సరే! మానాన్నగారికి జాబు వ్రాస్తాను."

"హమ్మయ్య! ఎన్నాళ్ళకు నిన్ను 'సరే' అనిపించ గలిగాను." దగ్గరగా వచ్చి ఆవేశంగా అతని రెండు చేతులు పట్టుకుంది రోజా.

అతను వెంటనే తన చేతులను వెనుకకు తీసుకున్నాడు. అలా ఎందుకు చేశాడో అతనికే తెలియదు.

తనని దగ్గరకు తీసుకుంటాడు. అనుకొన్న రోజాకు నిరాశ ఎదురయింది.

అతనెప్పుడూ అంతే. తనెంత దగ్గరకు వెళ్ళా మనసుకంతా అతనంత దూరంగా జరిగిపోతుంటాడు. అసలు ఇతనికి ఏ అనుభూతులు లేవా? కోపంగా అతని మొహం వంక చూసింది.

“ఏమిటలా చూస్తున్నావు? నిజంలే అన్నానుగా!” అన్నాడు రాఘవ.

“నీ అవతారం చూస్తే అపర ప్రవరాఖ్యుడిలాగ వున్నావని..” వెక్కిరింతగా అన్నది.

“సరే వస్తాను.”

“నాకు పెళ్ళి ఏర్పాట్లు చేయించేస్తున్నారు. మళ్ళీ మనస్సు మార్చుకోకేం” రోజా కేక వేసింది.

ఆమె భయం ఆమెది. రోజా రాఘవకు ఎక్కడైనా కనిపించ వచ్చు. రాఘవ ‘ఎందుకు వెళ్ళిపోయావు నాతో చెప్పకుండా’ అని ఒత్తిడిచేస్తే తాను అన్నమాటలు అతనికి చెప్పేస్తుందేమో నని భయం. అందుకే సాధ్యమైనంత త్వరలో ముహూర్తం పెట్టించేయాలని ఆమె ఆరాటం. పెళ్ళి అయిపోయిందంటే రోజా కాదు, రోజా తాతలాంటివాళ్ళు వచ్చినా తను లెక్కచేయదు. అసలు తను అలాంటి వాళ్ళను రానీయదు కూడా!

వెళ్ళిపోతోన్న వాడల్లా ఒకసారి వెనక్కుతిరిగి రోజావంక మెరుపుగా చూశాడు రాఘవ. రోజా చూపుకు అతని మనస్సు చివుక్కుమంది. అతనంత స్థిరత్వం లేనివాడనా ఆమె భావం? అసలు ఒకటి చేద్దామనుకుంటే ఎన్ని కష్టాలైనా

భరించి చేస్తాడు కాని మనస్సు మార్చుకోవడం ఉండదు. ఆలోచిస్తూనే ఇంటికి వెళ్ళాడు. రోజాతో తన జీవితం ఎలా ఉంటుందో పూర్తిగా ఆలోచించుకోకుండానే ఇందులో దిగుతున్నానా అనిపించింది ఆతనికి.

* * * *

రోజా త్వరలోనే ముహూర్తం పెట్టించింది. రేపునిశ్చితార్థమనగా ఆ ఉదయం రాఘవ రోజా ఇంటికి బయలుదేరి వెళ్ళాడు. రోజాకు చీర తీసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమెనుకూడా తీసుకువెడితే, ఆ తీసుకునేదేదో ఆమెకు నచ్చిందే తీసుకోవచ్చు. అనే ఉద్దేశంతో వచ్చాడు. హాల్లో అడుగు పెట్టాడు.

ప్రక్క గదిలోనుండి రాజేశ్వరరావుగారి మాటలు వినిపించాయి.

“ఏమోనమ్మా నాకున్నది మీరిద్దరే కూతుళ్ళేకదా! మీ రిద్దరూ నా రెండు కళ్ళు. నా కళ్ళు నాకు దూరం కాకూడదు. తల్లిలేని మిమ్మల్ని జాగ్రత్తగా పెంచుకొచ్చాను. మీ రిద్దరూ నాదగ్గరే ఉండాలి” రాజేశ్వరరావుగారి కంఠం అది.

“అదేమిటి నాన్నా! నేను మాత్రం వాళ్ళింటికి వెళ్ళి వాళ్ళలా సామాన్యంగా బ్రతకగలనా? నేనూ రాజేశ్వరరావుగారి అమ్మాయిని. నాహోదా నేను నిలుపుకో వద్దూ? అసలు రాఘవ చేత ఉద్యోగం మానిపించేసి బిజినెస్‌లోకి లాగమూ.” ఎంతో నమ్మకంగా అంటోంది రోజా.

“ఏమో నమ్మా! అతను చాలా నిక్కచ్చి మనిషి అని విన్నాను.” భారంగా పలికింది రాజేశ్వరరావుగారి కంఠం.

"మీరు లేనిపోని అనుమానాలు పెట్టుకోకండి, అతనికి నేనెంత చెబితే అంత" గర్వంగా అంటోంది రోజా.

"అది కాదమ్మా! నువ్వతనిని సరిగా అర్థం చేసుకోలేదేమో! ఇలాంటి విషయాలు ముందరే చెప్పాలి." రాజేశ్వరరావుగారు అంటున్నారు.

"ఇప్పుడు చెప్పకు నాన్నా, నీకు పుణ్యం ఉంటుంది. ఈ పెళ్ళి అయిపోనీ. తప్పకుండా అతనిని ఒప్పించి మనింట్లో ఉండేటట్లు చూసే పూచీ నాది." ధైర్యం చెబుతోంది రోజా

"ఏమో? రేపు నేను ఇల్లరికానికి ఒప్పుకోలేదంటే! అనవసరమైన గొడవలు ఎందుకు ?" అని తృప్తిగా అంటున్నారు రాజేశ్వరరావుగారు.

"అతనక్కడకు రానంటే, నేనక్కడకు రానంటాను. ఎంతకాలం నన్ను వదిలి ఉంటాడు? అప్పుడు తనే వస్తాడు." రోజా నవ్వింది గర్వంగా.

ఆ నవ్వుతో రాఘవ ఒంటి మీద తేళ్లూ, జెర్రిలూ పాకినట్లయింది. వాళ్ళ సంభాషణంతా విన్నాక రాఘవకు భూమి గిరగిర తిరుగుతున్నట్లు అనిపించింది.

"కాఫీ తీసుకోండిబాబు! కూర్చోండి. మీరు రావటం చూశాను. కాఫీతీసుకువద్దామని లోపలికి వెళ్లాను. చిన్నమ్మగారు అయ్యగారితో మాట్లాడుతున్నారు. పిలుస్తాను ఉండండి!" వెంకన్న లోపలకు వెళ్ళబోయాడు.

"ఆగు వెంకన్న నేను వెళుతున్నాను. నేను వచ్చివెళ్లినట్లు నువ్వు చెప్పకు" గబగబా బైటకు వచ్చేశాడు రాఘవ. ఎలా ఇంటికి చేరాడో అతనికే తెలియదు.

"ఏమోయ్ అప్పుడే అయిపోయిందా షాపింగ్? ఒక్కడివే వస్తున్నావు! మీ ఆవిడేది? అసలు పాకెట్లు ఏమీ లేవే మీటి చేతిలో?" హడావుడిగా నవ్వుతూ ఎదురు వచ్చిన శాంత అతని ముఖం చూడగానే ఆగిపోయింది.

"ఏమైంది రాఘవా ?" భయంగా అడిగింది.

ఏం మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి బట్టలయినా మార్చుకోకుండా మంచం మీద వాలిపోయాడు రాఘవ.

రోజా తనని ప్రేమించినప్పుడు తన వాళ్ళందరినీ గౌరవించడం ఆమె ధర్మం కదా! తన స్థితిగతులూ అన్నీ ఆమెకేమాత్రం నచ్చనప్పుడు తనెందుకు పెళ్ళి చేసుకోవాలి? తననీ, తనవాళ్ళనీ గౌరవించలేని తనకక్కరలేదు. ఎప్పటికప్పుడే తను సరిపెట్టుకుంటున్నాడు, కానీ, రోజా అసలు తనని అర్థం చేసుకోలేదు. ఆమె మాటల్లో ఎంతఅహం! ప్రతిదానికీ ఏదో పట్టుపట్టడం ఆమెకు అలవాటే. తల్లిలేని పిల్లకావటం వల్ల, చిన్నతనం వల్ల గారాం అనుకునేవాడతను. కాని ఎంత సాహసం? పెళ్ళి అయ్యాక ఆ వెర్రిమొర్రి ఫాషన్లు తగ్గించి తన ఇంటికి ఇల్లాలుగా వస్తుందని ఆశిస్తున్న అతను, ఆమె మాటలు అతను విన్నాడు కాబట్టి సరిపోయింది. అదే కనుక పెళ్ళి అయ్యాక జరిగి ఉంటే జీవితాంతం దిద్దుకోలేని పొరపాటుగా నిలిచి ఉండేది.

ఏదో ఆలోచించుకున్న వాడిలా లేచాడు రాఘవ. రామం ఇంటికి వెళ్ళాడు.

"హల్లో పెళ్ళికొడుకా! మమ్మల్ని మరచిపోయావేమో ననుకున్నా. రా. రా." ఆహ్వానించాడు రామ్.

"రామ్ నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి. బయటకురా." రాఘవ అన్నాడు.

రామ్‌కు ఒక్కసారిగా భయంవేసింది. సరోజ సంగతి తెలియలేదు కదా. ఒకవేళ సరోజ కనిపించి తనూ, రోజా ఆమె ఇంటికి వెళ్ళటం మొదలైనది అన్నీ చెప్పిందేమో అని ఆలోచిస్తూనే బయటకు వచ్చాడు రామ్.

"చూడు రామ్! ఈ చీటీ రోజాకు ఇచ్చిరా. మరచి పోకుండా వెంటనే ఇవ్వాలి" అన్నాడు రాఘవ.

"హమ్మయ్య! సరోజ విషయం కాదన్న మాట" అనుకున్నాడు రామ్.

"ఏమిటంత అర్జంటు? నువ్వే వెళ్ళవచ్చుకదా! ప్రేమ లేఖ లెందుకు?" హాస్యంగా అన్నాడు రామ్.

"ప్రేమలేఖ కాదు రామ్. రోజా నేనూ ఉత్తరధ్రువం, దక్షిణధ్రువాలని తెలుసుకున్నాము. మాకు పొత్తుకుదరదు. ఈ పెళ్ళి ఆగిపోవాలి." క్రోధస్వరంలో అన్నాడు రాఘవ.

"ఏమిటి రాఘవా నువ్వనేది?" ఆశ్చర్యపోతూ అడిగాడు రామ్.

"ఇంకేం మాట్లాడకు రామ్! ఈ చీటీ తీసుకువెళ్ళి ఆమెకు ఇచ్చిరా. ఈ ఉపకారం ఒక్కటి చేసిపెట్టు" అంటున్న రాఘవ మాటలకు మరేం మాట్లాడలేక పోయాడు రామ్.

రామ్‌కు బుర్ర తిరగ సాగింది. రాఘవపరిస్థితి ఏమర్థం కాకుండా వుంది. అతని బుర్ర పనిచేయటం మానేసింది. ఒక వైపు మరో భయం- రోజాతనూ సరోజ దగ్గరకెళ్ళి భయపెట్టిన విషయం తెలిసిపోతుందేమోనని! ఈ ఆలోచనల గజిబిజితో రామ్ మనసు కల్లోలమై పోయింది.

# 4

కీచుమని శబ్దంచేస్తూ ఆగిపోయింది సడెన్ బ్రేకుతో కారు. కారులోంచి ఏభైఏళ్ళ ఒకాయనదిగి పడిపోయిన అమ్మాయిని లేవనెత్తాడు. జనం చుట్టూరా చేరారు.

"ఏమిటమ్మాయ్! చూసుకోకుండా నిర్లక్ష్యంగా ఆలోచిస్తూ నడిస్తే ఎలా ? నీకు బ్రతకాలనిలేదా ?" అంటూ ఆ అమ్మాయి ముఖంకేసి చూసిన ఆయన అలాగే ఆగిపోయాడు.

"నువ్వు కృష్ణమూర్తిగారి అమ్మాయివి కదూ? నీ పేరు సరోజకదూ? నువ్వు పదేళ్ళ పిల్లగా ఉన్నప్పుడు చూశాను. మూడేళ్ళక్రితం మీ నాన్న కనిపించి నీ ఫోటో ఒకటి ఇచ్చి వరుడెక్కడైనా ఉంటే చూడమన్నాడు. ఎక్కడ ఉంటున్నారు? నాన్న ఎక్కడున్నారు? ఇక్కడికి ఎలా వచ్చావు? కాలేజీలో చదువుతున్నావా? అన్నట్లు దెబ్బలేమన్నా తగిలాయా?" కంగారు కంగారుగా అన్ని ప్రశ్నలూ కలగాపులగంగా వేసేశాడు.

"అవునండీ! కృష్ణమూర్తిగారి అమ్మాయినే, నాన్న పోయారీ మధ్యన" నమ్రతగా సమాధానం చెప్పింది.

సరోజచుట్టూ చేరినజనం విడ్డూరంగా చూస్తున్నారు.

"నేను రామిరెడ్డిని. మీ స్నేహితుడిని ఇక్కడ బట్టలషాపులో మేనేజరుగా ఉంటున్నాను. పాపం నువ్వొక్కత్తెవు ఎక్కడ ఉంటున్నావు? మీ బంధువుల దగ్గరా?"

అంత మంది జనం ముందు ఆయన ప్రశ్నలు తికమక పెట్టాయి. కొంచెం ఇబ్బందిగా ముఖం పెట్టింది.

"దా, ముందు కారెక్కు. మా ఇంటికి వెడదాము. తరువాత అన్ని సంగతులు మాట్లాడుకోవచ్చు." అన్నాడు రెడ్డి.

ఏడేళ్ల పిల్లగా ఉన్నప్పుడు ఆయనను తను చూసింది. ఆయన ముఖం గుర్తుంది. అదీగాక తన తండ్రి చెప్పేవాడు రామిరెడ్డి తన ఆప్తమిత్రుడని. అందుకని సందేహించకుండా కారెక్కింది.

ఇంటికి చేరిన తర్వాత ఆయన తన భార్యను, ఇద్దరు కూతుళ్ళను సరోజకు పరిచయం చేశాడు.

"నీ కెవరూ బంధువులు లేరా సరోజా?" రామిరెడ్డి కూతురు నీరజ అడిగింది.

ఒక్కసారిగా ఆమె కళ్ళముందు రాఘవ కదిలాడొక్క క్షణం. 'నేను లేనా? ధైర్యంగా ఉండు సరోజా.' అన్న అతని మాటలు చెవిలో గింగురుమన్నాయి. కాని తను ఎంత అవివేకంగా ప్రవర్తించింది? సరోజా వెళ్ళిపొమ్మంటే తన అభిమానం దెబ్బతింది. రాఘవ సరోజల వివాహానికి తను ఏవిధంగా అడ్డమో, ఎంత ఆలోచించినా బోధపడ లేదామెకు. ఏది ఏమైనా అక్కడుండి వెళ్ళిపోతే రాఘవ సుఖపడతాడన్నట్లు తెలిసింది. సరోజా [illegible] వెంటనే సామానును సర్దుకొని రైల్లో ఎక్కి హైదరాబాద్ చేరింది. క్లోక్ రూములో సామానులు పెట్టి, ఏమిచేయాలా అని ఆలోచిస్తూ నడుస్తున్న తను, రామిరెడ్డి కారుక్రింద పడిపోవటం, అతను గుర్తుపట్టడం జరిగింది.

"ఎవరూ లేరు. ఇక్కడేమైనా ఉద్యోగం సంపాయించుకోవాలి." అంది సరోజ.

"అమ్మాయ్ నువ్వేమీ అనుకోకపోతే ఇక్కడే మా అమ్మాయిలతో పాటు కాలేజీలో చదువుకో. అన్నట్లు ఎందాకా చదువుకున్నావు?" రామిరెడ్డి అడిగాడు.

"మెట్రిక్ పాసయ్యాను" నెమ్మదిగా అంది సరోజ.

"అవును సరోజా! మా వాళ్ళతో పాటు కాలేజీలో చదువుకో!" నీరజ ఉత్సాహంగా అంది.

రాఘవ 'కాలేజీలో చదువు సరోజా' అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. ఎంతో ఆత్మీయుడనుకున్న రాఘవదగ్గరే డబ్బు తీసుకోవడానికి అభిమానం అడ్డువచ్చింది. అలాంటిది ఎప్పుడో నాన్నగారి స్నేహితుడైన రామిరెడ్డి సహాయం చేస్తానంటే......'

"వద్దండీ. నేను కాలేజీలో చదవను."

ఆమె ముఖంలో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్న అభిమానం తాలూకు ఛాయలు చూసి 'అచ్చు తండ్రిపోలికే సరోజ. అతనుకూడా నేనెంత సహాయం చేస్తానన్నా పై చదువులకు వెళ్ళలేదు' అనుకున్నాడు రామిరెడ్డి.

"పోనీ నీకు ఉద్యోగం దొరికిన తర్వాత నా డబ్బు నాకు తిరిగి ఇచ్చేద్దువుగానిలే." అలాగైనా నా ఋణం తీర్చుకుంటుందేమోనని అనుకున్నాడు రామిరెడ్డి.

"లేదు! చదువు ముగించి ఉద్యోగం వచ్చేసరికి కనీసం నాలుగు సంవత్సరాలు పైమాటే! అసలు చదువు పూర్తి చేసిన వెంటనే ఉద్యోగం దొరుకుతుందని నమ్మకమేమిటి? వచ్చినా నా పోషణ జరుపుకుంటూ మీకు తీర్చేంత జీతం వస్తుందా?

ఇప్పుడే ఏదైనా చిన్న నౌకరీ చేయటం మొదలు పెడితే దానిమీద వచ్చేదానితో పొట్టపోషించుకోవచ్చు" అంది సరోజ.

"నీకు ఉద్యోగమా!" మెట్రిక్ చదివిన సరోజకు ఉద్యోగం ఏమి వస్తుంది ఈ పట్నంలో, అనిపించింది ఆయనకు.

"మీ బట్టలకొట్లో ఏదైనా చిన్న ఉద్యోగం దొరికితే చేస్తాను. ఏదైనా సేల్సుగరల్ పోస్టు దొరకక పోతుందా?"

'కృష్ణకూతురు బట్టలకొట్లో పనిచేయటమా! నాకెంత బాధ' అనుకొన్నాడు ఆయన.

"అవమానమేముంది? బాధేముంది అందులో? నీతిగా కష్టపడి నాలుగురాళ్ళు సంపాదించుకుని బ్రతకటం మంచి పద్ధతి కాదా? నాకాళ్ళమీద నేను నిలబడి న్యాయంగా సంపాదించినప్పుడు బాధ దేనికి?" ఆవేశంగా అంది. ఆ ఆవేశంలో ఇంకా కష్టాలు ఏమేవో చెప్పబోయిన ఆమెను, ఆమె మనస్సు అణచిపెట్టింది. కొత్తచోటు, కొత్తవాళ్ళతో తన అభిప్రాయాలు, కష్టసుఖాలు చెప్పటం అనవసరమని తోచింది.

"సరే అయితే మా షాపు యజమానిని అడిగి చూస్తాను" అన్నాడు రామిరెడ్డి.

తరువాత అదేషాపులో సేల్సుగరల్ గా ఆమె చేరటం, గాంధీనగర్ లో ఒకగది అద్దెకు తీసుకుని సామాన్లుసర్దుకోవటం చకచకా జరిగిపోయాయి.

# 5

"నాన్నగారూ! ఆయన మాకేమో కాని, నాకే ఇక్కడ వుండాలని లేదు. ఆయన ప్రాక్టీసు చేసే ఊళ్లోనే ఉంటాం" పెళ్ళి చేసుకుని సుఖపడాలనుకున్న రోజా అక్కడే ఉండిపోతే జ్ఞాపకాలు వెన్నాడుతూ వుంటాయనే భయంతో అలా అంది.

"సరే నీ యిష్టమమ్మా!" పరిస్థితులన్నీ తెలిసిన రాజేశ్వరరావుగారు అంతకంటే ఏమీ అనలేకపోయారు.

రోజా ఒక్క నిట్టూర్పు విడిచింది. రాఘవను ఏదో దెబ్బ తియ్యాలని గోపాల్‌ను పెళ్ళి చేసుకుంది.తన జీవితాన్ని తారుమారు చేసిన రోజు గుర్తుకు వచ్చింది రోజాకు.

రాఘవ వచ్చి షాపింగ్‌కు తీసుకు వెళతాడని ఎదురు చూస్తోంది. ఇంతలో రామ్ ప్రూడిపడ్డాడు.

"ఏమిటి రామ్! మీ స్నేహితుడు ఇవాళ షాపింగ్‌కు వెళదామని అన్నారు. ఇంతవరకు రాలేదు. అదేమిటి నువ్వు అంత నీరసంగా వాలిపోయినట్టు కనిపిస్తున్నావు? ఏమైనా పని ఉన్నదా? రా లోపలికి. కూర్చో కాఫీ తీసుకుందువుగాని."

"నా పనేం కాదు. నాకే కష్టమూ రానూ లేదు. రాఘవ నీకీ ఉత్తరం అర్జంటుగా అందచేయమన్నాడు."

ఎప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ ఉండే రామ్ ఇటు వంటి సంతోష సమయంలో అంత ముభావంగా ఎందుకు ఉండాలి! అతని ముఖం వంక చూస్తూ జాబు అందుకుంది.

ఏముందీ, అర్జంటుగా ఫలానాపాపుకి రా! చీర సెలెక్టు చేద్దామనో, మరేదో వ్రాసి వుంటాడు. పిచ్చి రాఘవ! అసలీ గాడిదకి లవ్ లెటర్ వ్రాయటం వచ్చా? ఈ రకమైన ఆలోచనలతో నవ్వని నవ్వు నిలిచింది గిరిజా పెదవుల పై.

నెమ్మదిగా విప్పి చదవటం ప్రారంభించింది. రెండే రెండు లైన్లు — "నేను నీకు తగిన వాణ్ణి కానుగనక, మన పెళ్ళి అసంభవం" అని వ్రాశాడు రాఘవ. గిరిజా ముఖం కోపంతో ఎర్రబారింది. అసలింత స్థిరత్వం లేని మనిషేమిటి రాఘవ్ అనిపించింది. రాఘవమీద దెబ్బతీయాలి. అతనిని సిగ్గని ఆవేదనకు గురిచేయాలి అనిపించింది.

"నీ స్నేహితుడికి చెప్పు. ఆమె తప్పకుండా అనుకున్న ముహూర్తానికి పెళ్ళి చేసుకుంటుందని, ఆవరుడు రాఘవ కాదు. కాని, రాఘవకంటే స్థితిపరుడు, ఆదర్శాలవాడు. స్త్రీ హృదయాన్ని అర్థంచేసుకో గలిగిన ఉత్తముడు అయిన యువకుడు. వెళ్ళి చెప్పు" కోపంగా లోపలికి వెళ్ళిపోయింది.

రామ్‌కు అంతా తెలుసు కనుక ఆమె ప్రవర్తనకు ఆశ్చర్యపోలేదు.

గిరిజాను చేసుకోనని రాఘవ తెలియజేసిన విషయం రాజేశ్వరరావుగారికి తెలియగానే ఆయన సంతోషించారు. ఆయనకు మొదటినుండీ గిరిజాను తన స్నేహితుడి కొడుకైన గోపాల్‌కిచ్చి చేయాలనే ఉంది. అతను డాక్టరు. కాని కూతురుపట్టుదలతో తప్పనిసరిగా రాఘవతో వివాహానికి అంగీకరించాడు.

"ఇప్పుడేం చేద్దాం?" కూతుర్ని ప్రశ్నించారు ఆయన. గిరిజా అహం, రాఘవ తిరస్కారంతో పూర్తిగా దెబ్బతింది.

'ఇంతవరకూ తన ప్రాపుకోసం పడిగాపులు పడ్డవాళ్ళే! తిరస్కరించినవారు లేరు. రాఘవ ఏం చూసుకుని తనని కాదన్నాడు? తండ్రికి నచ్చిన గోపాల్‌ని చేసుకుని 'చూడు నేను ఎంత ఆనందంగా ఉన్నానో!' అని చూపించాలి. అప్పుడతని ముఖం చూడాలి! పాపం తను చేసుకోకపోతే పెళ్ళే కాదనుకున్నాడు కాబోలు!' ఇటువంటి ఆలోచనలతో సతమతమవుతున్న గోజా తండ్రి అడిగిన ప్రశ్నకు వెంటనే జవాబిచ్చింది.

"నాన్నగారూ! నేను గోపాల్‌ను చేసుకుంటాను. అతనకిచ్చి చేయండి."

కూతురి సమాధానానికి ఆయన ఎంతో సంతోషించారు. డాక్టర్ గోపాల్ అయితే ఇక్కడే ప్రాక్టీసు పెట్టుకుంటాడు. అనుకున్నారు ఆయన.

డాక్టర్ గోపాల్, గోజాల పెళ్ళి అయిన తర్వాత ఒక రోజున "అమ్మాయ్! ఎల్లుండి ఆదివారం నుంచి గోజా, మీరు కొత్త సంసారం ప్రారంభించటానికి అన్నీ ఏర్పాట్లు చేస్తాను" అని గాజేశ్వరరావుగారు కూతురు గోజాతో అన్నారు.

ఇది ఇలా ఉండగా రాఘవపై పెళ్ళివిషయమై ఒత్తిడి రాసాగింది. "రాఘవా! ఎన్నాళ్ళిలా ఉంటావు. అన్నీ వున్నై. తల్లి లాంటిదాన్ని చెపుతున్నాను. నా మాట విను" రాఘవ పెద్దవదిన వెంకటలక్ష్మి బతిమాలింది.

ఆమె అత్తగారు పోయినప్పటినుండీ మరుదుని బిడ్డలని. ఆడపిల్లని ఎంతో జాగ్రత్తగా పెంచింది. రాఘవ ఐ. ఏ. ఎస్. ఆఫీసరయ్యాక వెంకటలక్ష్మిని తీసుకువచ్చి పట్నంలో అన్నీ చూపించాలి అనుకున్నాడు. దానికి తగ్గట్లు ఆమె ఆరోగ్యం

కూడా బాగోలేకపోవటంతో డాక్టర్‌కు చూపించాలనీ ఆమెను తీసుకు వచ్చాడు. మంచిహోదా, పెద్ద బంగళా, వంట వాడూ అన్ని సౌకర్యాలు ఉన్నా అతని జీవితాన్ని చూడ గానే మంచి జోడు ఉంటే బాగుండును అనిపించింది ఆమెకు.

వదిన అన్న మాటలకు నవ్వి ఊరుకున్నాడు రాఘవ. కాని అతని మనసు వంటరి తనంలో వేసారిపోయింది. తను ఎన్ని కలలు కన్నాడు! ఐ. ఏ. యస్ పరీక్షకు వెళుతున్నట్లు రోజాకు చెప్పకుండా వుంచాడు. ఐ. ఏ. యస్ పరీక్షలో ఉత్తరుడై సెలెక్టు తర్వాత ఆ విషయం రోజాకు చెప్పాలను కున్నాడు. ఆమెను ఆశ్చర్యానందంలో వుక్కిరిబిక్కిరి చేయాలనే ఉవ్విళ్ళూరాడు. కాని తనొకటి తలిస్తే దైవం ఒకటి తలచిందన్నట్లు, రోజాను తను పెళ్ళిచేసుకోనని చెప్పటం. రోజా పెళ్ళి వేరొకరితో కావడం జరిగింది. అది అయినా వారానికే. తను ఐ. ఎ. ఎస్ పాసయ్యాడు. తరువాత సెలక్టు కావటం, శిక్షణ పూర్తి చేసుకొనటం జరిగింది.

కొత్తగా ఐ. ఏ. ఎస్ ఆఫసరుగా హైదరాబాద్‌లో వేశారు. పెద్దవదిన పెళ్లి మాట లేవనెత్తడంతో రోజా తలపులు మళ్లీ తల ఎత్తాయి. రోజాను తను ప్రేమించాడు. కాని ఆమెను సరిగా అర్థం చేసుకోకుండా ప్రేమించాడ . ఆమె మన స్తత్వం ఉత్తర దక్షిణ ధృవాలు. నయం, ఇంకా ఆమెను పెళ్ళి చేసుకోలేదు. చేసుకొని ఉంటే ప్రతి నిముషం ప్రళయమే ఉండేది. సమానాంతర రేఖల్లాంటి తమ నడవడి కలు ఎక్కడా కలవక బాధపడేవారు.

"ఏమోయ్! ఏమిటాలోచిస్తున్నావు? నాన్నగారు కూడా నీగురించి బెంగపెట్టుకున్నారు. 'నీమాట వింటాడు

నువ్వు చెప్పమన్నా అన్నారు. అందుచేత నా మాటకు ఆ విలువ నిలుపు" వెంకటలక్ష్మి బ్రతిమాలుతున్నట్లు అడిగింది.

వదిన మాటలకు సమాధానం చెప్పకుండానే మళ్ళీ ఆలోచనలో పడ్డాడు రాఘవ.

'పెద్దన్న పెళ్ళికి వచ్చినడబ్బు తన చదువుకి వినియోగించాడు. రెండో అన్నకి వచ్చిన కట్నం బ్యాంకులో వేసి చెల్లెలి పెళ్ళిచేయటం కొంత అప్పుతో. ఆ అప్పు అంతా తీర్చాడు తను. తండ్రికి నెల నెలా కొంత డబ్బు పంపుతున్నాడు. ఇప్పుడు పెద్దవదినకు ఒక జత బంగారు గాజులు కొనాలనుకుంటున్నాడు. ఇంతదాకా తను కుటుంబంలో ఏ కలతలు లేవు. తండ్రి, ఇద్దరు అన్నగార్లూ, వదినలు, చెల్లాయి, బావగారు అందరూ ఎంతో ఆప్యాయంగా ఉంటారు. కాని అలా వున్నా తనకీనాడు ఏమిటో ఈ అశాంతి! సరోజకీ, తనకీ, ఏదో సంబంధం వున్నట్లు మాట్లాడింది రోజా ఒకప్పుడు. అప్పట్లో రోజాను మారంగా ఉండేది అందుకు నవ్వాడుతను, సరోజ అనే అమ్మాయి తనకి తటస్థపడకపోతే రోజా, తను పెళ్ళిచేసుకుని హాయిగా ఉండివుండేవాడుగా అని, కాని జరిగేవన్నీ మనమేలుకోసమన్నట్లు సరోజ తటస్థపడటం, రోజా అపార్థం చేసుకోవటం, ఆ కారణంగా పెళ్ళి ఆలస్యమవటం, ఈలోగా రోజా నిజస్వరూపం బయటపడటంతో, రోజాతో పెళ్ళి కాకపోవటం నిజంగా తన అదృష్టం అనిపించింది.

"ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" వెంకటలక్ష్మి అడగటంతో అతని ఆలోచనలకు అంతరాయం కల్గింది.

"వీధిలో టాక్సీ ఆగింది ఎవరో వస్తున్నట్టున్నారు రాఘవా!" వెంకటలక్ష్మి మాటలతో గేటువైపు తిరిగాడు రాఘవ. శివరావుగారు, యింకొకాయన టాక్సీదిగి గేటు తీసుకుని లోపలకు వస్తున్నారు.

"ఇతనే మా అబ్బాయి రాఘవ! ఈయన లాయరు. విశ్వనాథంగారు. ఈయనా, నేనూ ఒకప్పుడు సహాధ్యాయులం. పరిచయం చేశారు శివరావుగారు. విశ్వనాథంగారి కళ్ళు రాఘవను చూస్తూంటే మిల మిలా మెరిసాయి.

"మా రెండో అమ్మాయి నిర్మల ఎం. ఎ. చదువు తోంది. ఇంకో ఆరు నెలల్లో పూర్తవుతుంది. వరుడికోసం ఇక్కడకు వచ్చాను" కాఫీ మర్యాదలు పూర్తి అయిన తర్వాత అసలు విషయం బయట పెట్టారు విశ్వనాథంగారు.

రాఘవ సమాధానం చెప్పకుండా మౌనంగా కూర్చుండి పోయాడు.

"నేనే మీ నాన్నగారిని బలవంతంగా తీసుకువచ్చాను. మీరు ఇప్పుడేవచ్చి అమ్మాయిని చూడాలి. నాకు ముగ్గురు అమ్మాయిలు. అబ్బాయిలు లేరు." విశ్వనాథంగారు వివరాలు చెప్పడం ప్రారంభించారు.

రాఘవ ఉలిక్కి పడ్డాడు. ఈసంబంధంకూడా యిల్లరికం కాపతేమోనని అతని అనుమానం. అసలు తనకి పెళ్ళే యిష్టం లేనప్పుడు యిల్లరికం అయితేనేమి మరొకటి అయితే నేమి? తను పెళ్ళిచేసుకో బోవటం లేదుకదా, అనుకున్నాడు రాఘవ.

"అబ్బాయ్! చూసివచ్చేద్దాం నడు" శివరావుగారు ఆదేశించటంతో రాఘవ మౌనంగా లేచాడు.

విశ్వనాథం సమక్షంలో తండ్రికి ఎదురు చెప్పటం యిష్టంలేక వారితో బయలుదేరాడు రాఘవ.

# 6

“అమ్మగారూ! అమ్మగారూ!” వీరన్న గాభరాగా పిలిచాడు.

“ఏమిటిరా ప్రొద్దున్నే అంత గాభరా పడుతూ లేపావు?” నౌకరు వీరన్నను విసుక్కుంటూనే తలుపు తీసింది రోజా.

వీరన్న చేతుల్లో పసిపిల్లవాడు!

“వీరన్నా ఈ పిల్లవాడెవరు?” ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

“ఏమో నమ్మగారూ! ఏదో చంటిపిల్లాడి ఏడుపులా వినిపిస్తే బయటకువచ్చి చూశాను. ఈపసికందు మన కాంపౌండులోనే ఉన్నాడు. ఏ అమ్మో కని యిక్కడ పారేసింది. కాలమమ్మా కాలం! అంతే కాదమ్మగారూ? అబ్బాయి పొత్తిళ్ళలో చిన్న పర్సుకూడా వుంది. ఇదిగో నమ్మగారూ!” వీరన్న అతి నమ్మకంగా ఆ పర్సు రోజా చేతి కిచ్చాడు.

వీరన్న ఆ కాంపౌండులోని అవుట్ హౌస్ లో వుంటాడు. వీరన్న నిజాయితీకి ఆశ్చర్యపోయింది రోజా.

నౌకరు కళ్ళపడిన డబ్బు కానీ, డబ్బులున్న పర్సులు కానీ మళ్ళీ తిరిగిఇస్తారా? వీరన్న చాలా మంచివాడు అనుకుంది రోజా.

రోజా పర్సు తెరచి చూసింది.

పర్సు తెరచిచూస్తే అందులో ఒక కాగితం మాత్రమే ఉంది. డబ్బేమీ లేదు.

ఆత్రుతగా కాగితం విప్పిచూసింది. అది ఒక ఉత్తరం కాని ఎవరినీ సంబోధించిలేదు.

"నేను వెళ్ళిపోతున్నాను. నీ డబ్బు నాశించి నీవెంట రాలేదు. నిన్ను మనసారా ప్రేమించి, నిన్ను నమ్మివచ్చాను. నడివీధిలో నిలబెట్టావు. నా గురించి నాకు బెంగలేదు. కాని మా బాబు నా కడుపు పంటగా పుట్టాడు. వాడిని జాగ్రత్తగా పెంచుతావని ఆశిస్తున్నాను. నా జీవితం నాశనమయినందుకు నిన్ను దూషించను. కానీ నాకుమారునికి అన్యాయం చేశావో నా ఉసురు తగులుతుంది. నానస్తూరి నీకు తెలుసు. కనుక నా పేరు వ్రాయటం అనవసరం. నా పేరు వ్రాసి నీ పరువు తీయటం నా అభిమతం కాదు."

ఆ చీటీ చదివిన రోజాకు వెయ్యి అనుమానాలు వచ్చాయి. అంతే సరదాగా తనతో వుండే గోపాల్‌కు ఇంతటి పెద్ద బిడ్డలా? ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకుంటా నని నమ్మించి, ఆమెను మోసంచేసి తనని వివాహం మాడ తాడా!

రాఘవ విషయంలో ఒకప్పుడు తనకీ అనుమానం ఉండేది.

"అమ్మగారూ! అయ్యగారు లేస్తారేమో. ఈ అబ్బాయి విషయం చెప్పదామా?" వీరన్న అడిగాడు.

"వాడెవడో ఏమిటో మనకు తెలియదు వీరన్నా! ఎక్కడో దూరంగా తీసుకువెళ్ళి వదిలెయ్యి. కన్నవారే కటినాత్ములైనప్పుడు మనకేం పట్టింది?" కసీ ద్వేషం కూడా కట్టుకున్నాయి ఆమె కంఠంలో. వీరన్న ఏమీ మాట్లాడకుండా అలాగే నిలబడ్డాడు. ముద్దులొలికే ఆ బాబును ఎక్కడో వదిలేసి కుక్కల నక్కల పాలి చేయటం అతనికే మాత్రం ఇష్టంలేదు. అమ్మగారు ఎంత నిర్దయగా మాట్లాడారు అనిపించింది అతనికి.

"వీరన్నా! నీకే చెప్పేది. అయ్యగారికి ఈ విషయం తెలియనివ్వకు. వెళ్ళు." రోజా తొందరచేసింది వీరన్నను.

వీరన్న పసిగుడ్డును తీసుకుని వెళ్ళిపోయాడు. అతను రోజా చెప్పినట్లు ఆ పసి గుడ్డను ఎక్కడో వదిలిపెట్టలేక పోయాడు. తన స్నేహితుడు పోలయ్యకు పిల్లలు లేరు. ఎన్నాళ్ళనుండో అతను ఒక బిడ్డను పెంచుకోవాలనుకుంటు న్నాడు. అందుకే ఆ బాబును పోలయ్యకిచ్చి జాగ్రత్తగా పెంచుకో అని చెప్పాడు. రోజాకు తనేం చేయాలో తోచక తికమక పడింది.

గోపాల్ ఆసుపత్రికి వెళ్ళిపోయేదాకా మామూలుగా వుండిపోయింది. ఆమె పైకెంత మామూలుగా ఉన్నా రకరకాల ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది.

హు! ఆడది! అంత పొగరుమోతనంగా మగాడితో తిరగటం ఎందుకు? ముల్లు వచ్చి ఆకుమీద పడినా, ఆకు వెళ్ళి ముల్లుమీద పడినా ఆమెకే నష్టమనీ తెలిసీ, ఈ ఆడాళ్ళు

తొందర పడటమెందుకు? ఆ సమయంలో రాఘవకు తను ఎంత దగ్గరగా వెళ్ళబోయింది గుర్తుకు రాలేదు. కాని రాఘవే ఆమెకు దూరంగా వెళ్ళటం వలన తనకేమీ నష్టం కష్టం కలుగలేదని ఆమె అనుకోలేకపోయింది!

అసలు ఆ ఉత్తరం గోపాల్‌కు వ్రాసిందో మరి ఎవరికైనా వ్రాసిందో, ఏది ఏమైనా ఆ లేఖనుండి చిన్న ముక్క చింపి అది గోపాల్ ఇంటికి రాగానే డైనింగ్ టేబుల్ మీద ఆ చీటీలో నుండి చింపిన చిన్న ముక్క పెట్టింది. భోజనానికి కూర్చున్న గోపాల్ కళ్ళ బడింది ఆ కాగితం ముక్క.

"ఇదేమిటి? డైనింగ్ టేబుల్ మీద చెత్తంతా" ఆ కాగితం ముక్క తీసి పారేయబోయాడు.

"ఆ కాగితం ముక్క ఇక్కడికెలా వచ్చింది? చూద్దాం ఇలా ఇవ్వండి" ఏమీ ఎరగని దానిలా లాక్కోబోయింది.

"ఏమిటో నేనే చూస్తానుండు" లాక్కుని చూశాడు గోపాల్. అతని ముఖం ఒకసారి వెలవెలబోవటం అంతలోనే సర్దుకోవటం కనిపెట్టింది.

"ఏమిటంత చిన్న కాగితం ముక్కని అంత దీర్ఘంగా చూస్తున్నారు?" రోజా ప్రశ్నించింది ఏం తెలియనట్టు.

"అబ్బే ఏం లేదు. మా డాక్టర్లు ప్రతీది నిశితంగా పరిశీలిస్తారు" పెద్ద పెట్టున నవ్వాడు గోపాల్.

అతనలా నవ్వినప్పుడల్లా రోజాకు తేళ్ళు, జెర్రెలూ పాకినట్లవుతుంది. అసలు ఇప్పుడు ఆతను మాట్లాడిన దానిలో నవ్వటాని కేముంది అనిపించింది రోజాకు.

ఏదో నాటకంలో నవ్వినట్లు నవ్వుతాడు తప్ప, సహజంగా నవ్వుతున్నట్లుండదు అతని నవ్వు.

"ఏదీ నేనూ చూస్తాను" ఏమీ తెలియని దానిలా చేయి చాచింది.

"ఏం చూస్తావులే యిగో చిత్తు కాగితం ముక్కని" కిటికీలోనుండి అవతలకు పారేశాడు.

ఆ కాగితం ముక్క పెట్టిన తనకు తెలీదా అందులో ఏముందో! 'నీ పేరు, పరువు తీయటం ఇష్టం లేదు' అని వున్న ముక్క అది.

భోజనాలయ్యాయి. రోజా మేడమీదకు వెళ్ళి ఆ కాగితం పడేసిన చోట కెళ్ళింది. అక్కడ గోపాల్‌ను చూసి ఆశ్చర్యపోయింది. అతడు ఆ కాగితం ముక్కను చిన్న చిన్న ముక్కలుగా చేసి పారేశాడు. కసిగా పళ్ళు కొరికాడు. ఆ సమయంలో గోపాల్ రోజాకళ్ళకి గోముఖవ్యాఘ్రంలా, ఇంకా ఏదో ఏదోలా కనిపించాడు. రాఘవ ఈర్ష్య పడేట్లు ఎంతో సుఖపడాలనుకుంది. ఆమెకు ఈ సంఘటన ఆదిలోనే హంస పాదులా తోచింది. లేకపోతే తను ఈ కొత్తకాపురం ప్రారంభించిన వారానికే ఈ సంఘటనా! రోజా కళ్ళనుండి అప్రయత్నంగా రెండు కన్నీటి బొట్లు రాలాయి.

ఆ కన్నీటి మసక తెరల మధ్య అస్పష్టంగా రాఘవ కనిపించాడు. రాఘవ తనని చూసి నవ్వుతున్నట్టనిపించింది. 'నువ్వు ఓడిపోయావు సుమా! నేనెంత ఆనందంగా వున్నానో చూడు' అని వెక్కిరిస్తున్నట్టు అనిపించింది.

# 7

"హలో నీరజా. సంగీత పరీక్ష పాసయ్యావు. కంగ్రాచ్యులేషన్స్" నీరజ మనస్ఫూర్తిగా అభినందించింది.

"థాంక్స్ నీరజా" అన్నది కానీ సరోజ మనస్సు బాధతో వుంది. ఆనాడు తనకి వీణవచ్చినందుకు ఎంత సంతోషించాడు రాఘవ! ఈనాడు తను సంగీత పరీక్ష పాసవుతున్నదని తెలిస్తే! తన ఆనందాన్ని రాఘవతో పంచుకోవాలనిపించింది సరోజకు.

"సరోజా! నాన్నగారు ఏమన్నారో తెలుసా? పరీక్ష పాసయిన వెంటనే నీకు రేడియో ప్రోగ్రాములు వచ్చేలా ఏర్పాటు చేయిస్తానన్నారు. అప్పుడప్పుడు అక్కడ పాడుతుండమన్నారు. దానివలన అటు కీర్తి, ఇటు కొంత డబ్బు కూడా లభిస్తాయి. ఏమంటావ్?" నీరజ అడిగింది.

"నా కిప్పుడు ముఖ్యంగా ఆర్థికంగా ఇబ్బందేమీ లేదు. బట్టలషాపులో ఇచ్చే నూరు రూపాయలతో ఎలాగో గడిచి పోతోంది కదా" నిర్వికారంగా ఉన్నాయి సరోజ మాటలు.

"నిన్ను చూస్తే ఏమిటీ ఒకసారి అనిపిస్తుంది. వయసులో ఉన్న కన్నెపిల్లలకు ఎన్ని కోరికలుంటాయి! ఎన్ని కలలు కంటారు! నువ్వెందుకింత నిర్లిప్తంగా ఉంటున్నావో అర్థం కావటంలేదు. ఎందుకింత నైరాశ్యం?" నీరజ అడిగింది.

"కలలూ, కోరికలూ అన్నీ డబ్బున్న వాళ్ళకు నీరజా!

రోజు గడవడమెలాగా అని వాపోయే దురదృష్టవంతులకు కాదు."

"చూశావా! ఇప్పుడే అన్నావు నాకేమీ ఇబ్బంది లేదని. మళ్ళీ వెంటనే రోజు గడపట మెలాగా అనే చింత అంటున్నావు. నీ మాటలు బొత్తిగా నా కర్థంకావు. అయినా నీకేమీ ఆశలూ, ఊహలూ వుండవా? నా మట్టుకు నాకు బావ అమెరికానుండి ఎప్పుడు వస్తాడాఅని ఎదురుచూడటం తోనే సరిపోతుంది రోజంతా!" మనసువిప్పి మాట్లాడు తున్నది నీరజ.

"ఆశలు, ఊహలు అన్నీ వున్నవాళ్ళకు నీరజా! వాళ్ళ జీవితం వడ్డించిన విస్తరిలాంటిది. ఇంకో రకం వాళ్ళుంటారు. వాళ్ళు కష్టపడి పైకివస్తారు. అనుకున్నవి కష్టపడి సంపాదించు కుంటారు. వాళ్ళకి పైకి వచ్చేందుకు కొన్ని అవకాశాలు కూడా వుంటాయి. అంతే ఎవరి సహాయమైనా వుండి వుండొ వచ్చుకూడా. వాళ్ళజీవితం వండి వడ్డించిన విస్తరిలాంటది. ఇక మూడోరకం వారు వుంటారు చూడు, వాళ్ళు ఎంత కష్ట పడ్డా పైకిరాలేరు. వాళ్ళకి ఎవరి అండా ఉండదు. అవకా శాలూవుండవు. పరమపద సోపానంవలె ఉంటుంది వాళ్ళ జీవితం. కొంచెం పైకివద్దామనుకుని తలెత్తుకునేసరికి ఏ పాము కాటుతోనో మళ్ళీ కిందకు వచ్చేస్తుంటారు. వాళ్ళకి వండు కునేందుకు ఏమీ ఉండదు. ఒకవేళ కష్టపడి తెచ్చుకుని, వండుకుని వడ్డించుకుంటారనుకో, అది వాళ్ళ నోటిదాకా వెళ్ళకుండా నేలపాలు అవుతుంది!" చెప్పుకు పోతోంది సరోజ.

8)

"అబ్బ! ఏదో అడిగితే ఏదేదో వల్లిస్తున్నావు. బోధ పడదు నీ భాష. నేను అడిగేదానికి సూటిగా చెప్పు. వయసులో వున్న కన్నెపిల్లలు కలిసి లేవటం గురించి ఆలోచించరు. బరువు బాధ్యతలు గురించి పట్టించుకోరు. వాళ్ళంతా కేవలం ఆశ పెట్టుకుని కలలు కంటుంటారు కదా?" నీరజ ఆగింది.

"నేను చెప్పబోయేది అదేమరి. నా జీవితం, ఇందాక చెప్పానుచూడు, అందులో ఆఖరి కోవకు చెందినది. ఒక్క డబ్బువిషయంలోనే కాదు. అన్ని విషయాల్లోనూ అంతే నాకు. నేను రేపటిగురించి కలలు కనటం మూర్ఖత్వమే!"

"ఏమిటో అంతా పెద్ద వేదాంతిలాగా మాట్లాడుతున్నావు. అన్నట్లు మీ పక్కింటి అబ్బాయి ఏదో రవ్వంత గోల పెడుతున్నా డన్నావు కదా? నాన్నగారికి చెప్పాను. రేపొచ్చి కుర్రాణ్ణి శాస్తి చేస్తాను వాడికి అన్నారు"

"నాన్నగారికి చెప్పావా? నాన్నగారొచ్చి బుద్ధి చెప్తారా? చెప్తే బుద్ధి తెచ్చుకునే వాడయితే అలా ప్రవర్తించడు. నాన్నగారేమైనా చెప్తారనుకో. తరువాత యింకా రెచ్చిపోవచ్చు. అలాంటి వాళ్ళను చూసీ చూడనట్లు ఊరుకోవాలి. వాగి వాగి వాళ్ళే ఊరుకుంటారు. ఒంటరి ఆడదాన్ని, అందులో వయసులో ఉన్నవాళ్ళని చూస్తే ఇలా సమాజానికి చులకన. అతన్నని ప్రయోజనం లేదు. మన సమాజం మారాలి" నిట్టూర్చింది సరోజ.

"హు సమాజం! ఎవరి సమాజంలో వున్నది? మన మంతానే కదా! సమాజం మారాలంటే మనుష్యులు

మారాలి. సమానత్వం, సమానహక్కులు అంటూ వేదిక లెక్కి ఉపన్యాసాలిస్తారు. కాని ఆడది ఒంటరిగా ఉంటే ఎంతో తేలికగా చూస్తారు. అందుకే సరోజా, మా ఇంటికి వచ్చి ఉండు అంటాను నేను." ఇప్పటికైనా సరోజ మనస్సు మార్చుకుని తను ఇంటికి వస్తుందేమో అనే ఆశతో సరోజముఖం చూసింది నీరజ.

"ఇలాంటివాళ్లు మాటలకే కుక్కల్లాంటివాళ్ళు. మనం మాట్లాడకుండా వూరుకుంటే విసిగి వాడే వూరుకుంటాడు." సరోజ తేలిగ్గా అంది.

తీక్షణంగా చూసింది నీరజ. ఎన్నియుగాలు గడిచినా ఈ సమాజంమారదు. లేకపోతే ఏమిటి సరోజచెప్పేసామెత? ఆడవాళ్ళు, మగవాళ్ళు అంతా మనుష్యులే. అందరిలో వుండేవి అదే చీమూ, నెత్తురూ. ఏదో క్రోమోజోమ్స్ తేడా వలన ఆడ, మగా అనే భేదం వస్తుందని సుందరంఅన్నయ్య చెప్పగా తను విన్నది. అటువంటప్పుడు ఆడపిల్లకే అంత అలుసు ఎందుకో? స్త్రీ ఎంత చదువుకున్నా మగవాడికి, సంఘానికి భయపడుతూ బ్రతకవలసిందేనా? ఒక స్త్రీ, పురుషుడు కలిసి ఏదో చెయ్యరానిపని చేశారనుకో. మానం కోల్పోవటం అన్నది ఇద్దరికీ సమానంగా వర్తించాలికదా? అలా కాకుండా స్త్రీ మాత్రమే చెడిపోయిందనీ, ఆమె శీలం కోల్పోయిందనీ ఎందుకనాలి? మగవాడికిమాత్రం మానమర్యాదలు అక్కర్లేదా? ఎవరు పెట్టారో ఈ పద్ధతులు? ఈ రకమైన ఆచారాలు పెట్టిన వాడెవడు? ఇప్పుడు కాలం మారింది. సమాజం, మనుష్యులు మారాలి. స్త్రీ, పురుషులు సమానం. ఇద్దరికీ సమాన హక్కులు వుండాలంటున్నారు.

కాని రచయితలు వ్రాసే రచనల్లోను, సినిమాల్లోనూకూడా ఒక స్త్రీ మోసపోయినట్లు, బలాత్కరించ బడినట్లు, శీలం కోల్పోయినట్లు, దానివలన ఆమె జీవితాంతం పడరాని యిక్కట్లు పడట్లు చూపిస్తుంటారు. ఇవన్నీ ఎప్పటికి మారుతాయి? మానం, అభిమానం మొదలైనవన్నీ, ఆడ మగా యిద్దరికీ సమానమనే అనుకున్నప్పుడు, ఆడది అర్థరాత్రయినా నడిరోడ్డుమీద ఒంటరిగా, నిర్భయంగా నడవగలిగినప్పుడు స్త్రీకి సమానహక్కు యిచ్చినట్లు, ఆమెకు సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చినట్లు భావించటానికి వీలువుంటుంది. పక్కింటి అమ్మాయి అత్యాచారం జరుపబోతే తను వూరుకుంటుందా? వాడికి బుద్ధివచ్చేలా చెంపలు వాయించదూ?" యిలా ఆలోచిస్తున్న" సరోజకు తన జీవితంలో జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది. ఘనంటంతుకనేవాడే చేశాడో, లేక సైన్సు చేసిందో కాని మగవాడికి దేహబలం చేకూరింది.

"ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? జాగ్రత్తగా వుండు వస్తాను." నీరజ మాటలతో సరోజ ఆలోచనలకు అంతరాయం కలిగింది.

నీరజ వెళ్ళిపోయిన తర్వాత సరోజ మనస్సులో వెయ్యి ఆలోచనలు. తన జీవితం యిలా ఎందుకయిపోవాలి? అసలు తనెందుకు బ్రతకాలి? ఎవరికోసం బ్రతకాలి? లీలగా రాఘవ మెదలాడు ఆమె మదిలో. రాఘవెక్కడ? తనెక్కడ? అతను, తను ఎప్పటికైనా కలుస్తారా? కనీసం తను చనిపోయే లోగా ఒక్కసారైనా అతన్ని చూడగలదా? రాఘవకూడా యిలాగే అనుకుంటాడేమో! తన ఈ ఊహకు సరోజకు నవ్వు వచ్చింది. ఇదేమైనా సినిమా కథా? అతను

పెళ్ళిచేసుకుని రోజాతో హాయిగా వుండి వుంటాడు. ఇంక అతన్ని గురించి ఆలోచించకూడదు. ఇవన్నీ మానుకుని భగవ ధ్యానం చేసుకోవాలి. చచ్చిపోదామనుకుంటే చనిపోయాక ఏమవుతాం? అప్పుడింతకంటె ఆత్మ సుఖంగా వుంటుందని నమ్మకం ఏమిటి? అది కనుక తెలిస్తే, చనిపోవాలో లేదో తేల్చుకోవచ్చు!" ఎడతెగని ఆలోచనలతో ఆ రాత్రి గడిపేసింది సరోజ.

# 8

"టెలిగ్రాం సార్" పోస్టుబంట్రోతు కేకతో బయటకు వచ్చి సంతకంచేసి తీసుకున్నాడు రాఘవ.

పెద్దవదిన చనిపోయింది. కాన్పుకష్టమయి చనిపోయిందిట. తల్లిలేని తనని, చిన్నన్నయ్యనీ, లక్ష్మినీ కన్నతల్లిలా కాపాడిన గొప్పయిల్లాలు.

'లక్ష్మి నాకు పెద్దకూతురులాంటిది. అప్పు అయినాసరే మంచి సంబంధంచూసి చేయాలి,' అని పట్టుపట్టి మంచి సంబంధం చేయించింది. తన్ని మాత్రం 'నువ్వే నా పెద్ద కుమారుడివి రాఘవా' అనేది ఎప్పుడూ. ఆమె తోటి కోడలు శాంత అక్క చెల్లెళ్ళల్లాగా, అన్యోన్యంగా వుండే వారు.

అటువంటి మహాలక్ష్మి ఆ యింటినీ, ఆ ఇంట్లోనివాళ్ళ నందరినీ, ఈ లోకాన్ని వదిలి కనిపించని లోకాలకు వెళ్ళి పోయింది శాశ్వతంగా. నిండుముత్తయిదువలా ముస్తాబుచేసి పాడిమీద పడుకోపెట్టింతే, ఎప్పుడూ గంభీరంగావుండే రాఘవకుకూడా కన్నీరు ఆగలేదు. ఆమె పాడి ఎత్తేసరికి, ఇల్లంతా రోదనధ్వనులతో నిండిపోయింది.

శ్మశానం నుండి తిరిగివస్తుంటే అనిపించింది రాఘవకు. 'మూడునాళ్ళ ముచ్చటయిన ఈ జీవితానికి ఎంత ఆరాటం, ఎంత పోరాటం! నాటకానికి తయారైన పాత్రధారుడు స్టేజి ఎక్కి నటిస్తూ తన పాత్ర పూర్తి అవగానే వెళ్ళిపోతాడు. స్టేజి లాంటి ప్రపంచంలో ప్రతి జీవి తన పాత్రనుపోషించాలి. నా వాళ్ళు, నా యిల్లు, నా డబ్బు, ఆనందం, అనురాగం ఇవన్నీ మిథ్య. అన్నీ తెలిసే ఏమిటో మాయలో పడి పోతుంటాడు మానవుడు.' ఇలాగ ఆలోచిస్తుంటే రాఘవకు విరక్తితో కూడిన నవ్వు వచ్చింది. ఇదే కాబోలు శ్మశాన వైరాగ్యమంటే' అనుకున్నాడు.

"నాతో ఇద్దరు పిల్లలను తీసుకు వెళతా నండీ" రెండో కోడలు శాంత అంది శివరావు గారితో.

"ఎందుకమ్మా? నీకు ముగ్గురు పిల్లలు, వాళ్ళుకూడా చిన్నవాళ్ళు. మళ్ళీ పిల్లనుకూడా తీసుకువెడితే చేయలేవు" శివరావుగారు అలా అన్నారే కానీ, పెద్ద కొడుకు రమణా రావు ఆరుగురి పిల్లలతో ఎలా వేగగలడా అని మరొకవంక భయపడుతూనే ఉన్నారు. ఇన్నాళ్ళూ పెద్దకోడలుంది కాబట్టి తనకు కూడా సుఖంగా గడిచిపోయింది. చిన్నకోడలు శాంత మంచిదే అయినా మీరు వదిలి వెళ్ళాల్సి వస్తుంది

కదా. అంతేకాదు రమణారావుని, పిల్లల్ని వదిలి ఎలా వుండగలను అనుకుంటూ శివరావుగారు ఆయాసంగా ఉండిపోయారు.

"అందరూ నాతో కలిసిరండి అన్నయ్యా. కొన్నాళ్లు ఉందురు గాని. తరువాత చూడవచ్చు" రాఘవ రమణారావుతో అన్నాడు.

"ఎక్కడికీ రాలేను రాఘవా! ఇక్కడే పుట్టి ఇక్కడే పెరిగాను. ఈ ఇంటిలోనే లక్ష్మి కాపురం పెట్టింది. వున్నా, లేకపోయినా ఒక్కరోజుకూడా ముఖం ముడుచుకోలేదు. ఎప్పుడూ నవ్వుతూ వుండేది. ఇదే నా ఇంటిలో ఆనందమయంగా గడిచింది. గతం తెలుచుకుంటూ నా తనువు ఇక్కడే వెళ్ళిపోవాలి." రమణారావు అన్న మాటలకు అక్కడున్న అందరి కళ్ళు చెమర్చాయి దుఃఖంతో.

వెంకటలక్ష్మి పోయిన దగ్గరనుండీ, ఈ పన్నెండు రోజులూ రమణారావు వాలకం చూస్తుంటే అందరికీ భయంగానే ఉంది. ఏమిటో తనలో తనే గొణుక్కోవడం, విచారంగా మౌనంగా కూర్చోవటం, భోజనం సరిగ్గా చేయకపోవటం ఇవన్నీ చూస్తుంటే అందరికీ భయంగానే ఉంది- రమణారావుకు మతి స్థిమితం తప్పిపోలేదు కదా అని.

"పిల్లలంతా చిన్నవాళ్ళు. అందులో ఆడపిల్లలు, ఆడదిక్కులేని ఈ ఇంటిలో ఎలాగో!" శివరావుగారు మెల్లగా అనుకున్నారు.

"అందుకే మామయ్యా! అందరూ మాతో వచ్చెయండి. చంటి పిల్లల్ని పూర్తిగా నాకు వదిలేయండి" అంది శాంత.

అంతవరకూ రాఘవకు గుర్తులేదు. పుట్టిన పిల్లాడిని తను సరిగా చూడనే లేదని. ఆ పసిగుడ్డుకేసి చూశాడు. వాడు ఇదేమీ పట్టనట్లు తనలో తానే నవ్వుకుంటున్నాడు. అయిదుగురు ఆడపిల్లల తర్వాత బాబు పుట్టాడు. మొత్తం ఆరుగురు. పెద్దపిల్లకు పన్నెండేళ్ళు వాళ్ళందర్నీ ఎవరు పెంచాలి? ఎలా పెంచాలి? రాఘవ ఆలోచనలలో పడి పోయాడు.

పెద్దవదిన బ్రతికున్న రోజుల్లో ఎన్నోసార్లు నవ్వుతూ అనేవాడు, తను ఐ. ఏ. ఎస్ పాసయ్యాక వదినను తీసుకు వచ్చి నవ్వుడు అన్నాడు కూడా-

"వదినా! ఇద్దరు లేక ముగ్గురు అన్న సూత్రాన్ని మరిచిపోయారు. ఇప్పటికైనా జాగ్రత్త పడవద్దూ?" అంటూ

"ఏమిటోయ్ నీ వేళాకోళం! అంతా భగవంతుడి దయ. మనమేం చేస్తాం? ఆ దేవుడికి కరుణ ఉండాలి. ఆయ నకు వ్యతిరేకంగా సృష్టిని అరికట్టడం పాపంకాదూ?" అంది వెంకటలక్ష్మి.

ఆనాడు వదిన అమాయకత్వానికి నవ్వు వచ్చింది తనకు.

"నయం! నాతో అంటే అన్నావుకాని, డాక్టర్ల దగ్గర మాత్రం అనకు ఇలాగని. వాళ్ళు పరిహాసం చేస్తారు. అయినా ఆ భగవంతుడి దయవలననే ఈ కుటుంబ నియంత్రణ పద్ధతి కనిపెట్టారు కదా! అందుచేత ఆపరేషను చేయించుకుంటే పాపం రాదులే" అన్నాడు తను.

"అసలు, నాకాపరేషనంటే భయం లేదోయ్! మీ నాన్నగారు, మీ అన్నయ్యకూడా ఒక మగపిల్లాడు పుడితే బాగుండును" అంటున్నారు.

"ఏమిటో ఈ కాలంలోకూడా, ఆడా మగా అంటూ తేడా చూపడమేమిటి వదినా! ఏదో ఇద్దరు లేక ముగ్గురు పిల్లలు, వాళ్ళను పైకి తెచ్చి దేశానికి ఉపయోగపడేలా తీర్చిదిద్దాలి. ఒకవేళ దేశానికి ఉపయోగపడక పోయినా భారం మాత్రం కాకూడదు. అంతేకాని దేవు డిస్తున్నాడు. అంటూ పిల్లల్ని కంటుండటం, వాళ్ళకి సరైన తిండి పెట్టలేకపోవటం, దాని వల్ల వాళ్ళకి అనేక జబ్బులు రావటం, అరోగాలతో పెరగటం. ఇది దేవుడు హర్షిస్తాడా? అంతె మంది పిల్లల్ని సరిగా పెంచలేకపోవటం వల్ల వాళ్ళు పెద్దయ్యే సరికి దొంగలుగానో, తాగుబోతులుగానో తయారై జీవి తాలను వెళ్ళదీస్తే దాన్ని దేవుడు హర్షిస్తాడా? ఆయన ఇచ్చిన బిడ్డల్ని అలాగ తయారు చేస్తే సహించరాదా? ఐనా నీ తప్పేముంది? అన్నయ్యననాలి. ఆర్థికంగా అన్ని ఇబ్బం దులు పడుతూ కూడా, తన్నెంతో ప్రేమించిన అర్థాంగి ఆరోగ్యం పాడై పోతుందన్న జాలి లేకుండా "కులదీపకుడు" అనడం మూర్ఖత్వం?" ఆవేశంలో అన్నగారిని అంటున్నా నని కూడా తెలియలేదు రాఘవకు.

"పోనీలేవోయ్! ఆవేశపడకు! నువ్వేనా పెద్దకొడుకువి. ఈ సారి ఆడపిల్లయినా, మగపిల్లాడయినా నీ మాటవిని ఆప రేషన్ చేయించుకుంటాలే. మరి నువ్వు త్వరగా పెళ్ళిచేసుకో! నేను పురిటికి ఇక్కడికే వస్తానుగా" నవ్వుతూ అంది వెంకట లక్ష్మి.

9)

"ఇప్పుడు మళ్ళీ పెళ్ళి మాటెందుకు ? బలహీనంగా వున్నావు అన్నారు కదా! లేడీ డాక్టరు? మందులు తీసుకుంటుందు. అన్నీ అయ్యాక, అబ్బాయికి ఐదో నెల వచ్చాక వెళ్ళ వచ్చులే. అక్కడ వాళ్ళని వంట మనిషిని పెట్టుకోమంటాను."

"మరి నువ్వు చెప్పేది నేను వింటాను కాని, నువ్వు పెళ్ళి చేసుకో, నేనక్కడకి వచ్చి వుంటాను. ఆపరేషన్ చేయించుకుని మీా ఆవిడ చేత సేవ పొందుతాను." రాఘవ అన్నదానికి సమాధానం ఇచ్చింది వెంకటలక్ష్మి.

'అలాగే వదినా! నా తల్లిలాంటి నిన్ను సంతోష పెట్టటానికి,నిన్ను అనసరానికి ఆదుకోడానికి తప్పకుండా చేసుకుంటాను.' మనసులోనే అనుకున్నాడు రాఘవ.

అప్పుడే తను లాయరు విశ్వనాథంగారి అమ్మాయిని చూడటానికి వెళ్ళింది.

ఆ రోజు తను,తన తండ్రి విశ్వనాథంగారింటికి వెళ్లారు. కాసేపు అవీ ఇవీ మాటాడుకున్నారు.

"అమ్మాయ్ నిర్మల, కాఫీ తీసుకురామ్మా" విశ్వనాథంగారు పిలిచారు.

కాఫీ, ట్రేతో సన్నగా పొడుగ్గా చామన ఛాయతో నాజూగ్గా ఉన్న అమ్మాయి వచ్చింది.

ఆ అమ్మాయి ముఖం నిండా మశూచి మచ్చలు ! అవి లేకపోతే ఫరవాలేదు. బాగానే వుండేది ఆ అమ్మాయి అనిపించింది తనకు.

తండ్రి బలవంతం మీాద వచ్చాడు. కాని, తనేమన్నా ఆ అమ్మాయిని పెళ్ళాడబోతున్నాడా ఏమిటి? అమ్మాయి

ఎలా ఉంటే తన కెందుకు? అంతలోనే వదిన గుర్తుకొచ్చింది.

ఇంతలో బొద్దుగా, తెల్లగా అందంగా ఉన్న ఇంకో అమ్మాయి వచ్చింది.

"ఈమె మా పెద్దమ్మాయి రమ. మా మేనల్లుడికే యిచ్చి చేసి యిక్కడే వుండనిచ్చుకున్నాను వాళ్ళని" విశ్వనాథం గారు రమను చూపిస్తూ అన్నారు.

పెళ్ళికూతుర్ని చూశాక శివరావుగారి ముఖం అంతగా విడక పోవడంతో విశ్వనాథం గారికి ప్రాణం చివుక్కుమంది.

బంగారు పిచ్చికలాంటి రాఘవను వదలటానికి ఆయన మనసు అంగీకరించలేదు.

"అమ్మాయి చాలా తెలివైనది. అలాగని నేను చెప్ప కూడదనుకోండి. ఎప్పుడూ ఫస్టు రేంకు వస్తున్నది. రెండు నెలల క్రితం మశూచికం వచ్చి అలాగ అయిపోయింది కాని లేకపోతే మా రమలాగే ఉండేది". కొంచెం బాధ కనిపించింది ఆయన మాటలలో.

నిర్మల ముఖంలో విషాదం గూడు కట్టుకొని ఉంది. ఆమె కళ్ళలో నీరు నిలిచింది.

పాపం అనిపించింది రాఘవకు. "రూపం కాదు, ముఖ్యం. సంప్రదాయ స్థితిగతులు ముఖ్యం." విశ్వనాథం గారి అన్నగారు అన్నారు. ఆయన శివరావు గారిని ఒక కంట కనిపెడుతూనే ఉన్నారు.

రాఘవకు ఆ అమ్మాయి మీద జాలి కలిగింది. తెలివి, గుణం, డబ్బు, రూపం ఉన్న అమ్మాయి పెళ్ళి కావటంలో కష్టమేముంది! విధి వక్రించి ఆమె రూపం దెబ్బ

తిన్నది. గుణం విషయం ఇప్పట్లో తెలియదు. రూపం పాడయుందని పెళ్ళి అవలేదేమోనని బెంగ పెట్టుకున్నదేమో! ఆ అమ్మాయికి మంచి మనస్సు ఉండి తనలో ఒక తెగా మసలగలిగితే అంతే చాలు. ఆమెను అదృష్టవంతురాలిని చేయాలి. ఆ విధంగా వదిన మాట నిలబెట్టిన వాణ్ణి అవుతాను. ఇటు ఆ అమ్మాయిని పెళ్ళి అవదేమోనన్న బాధ నుండి తప్పించిన వాణ్ణి అవుతాను. రాఘవ ఒక నిర్ణయానికి వచ్చాడు.

"ఏమన్నాడు రాఘవ?" ఇంటికి వచ్చిన తరువాత మర్నాడు శివరావుగారు వెంకటలక్ష్మిని ఉద్దేశించి అడిగారు.

"మీకేం అభ్యంతరం లేదని వ్రాయండి. త్వరలో ముహూర్తం కూడా పెట్టేసుకుంటే సరి."

వెంకటలక్ష్మి సమాధానం శివరావుగారిని ఆశ్చర్యపరిచింది. రాఘవ అమ్మాయిని చేసుకోడానికి ఇష్టపడ్డాడా? సందేహం కలిగింది. అతను వెంకటలక్ష్మికి చెప్పకపోతే వెంకటలక్ష్మి అటువంటి సమాధానం ఎందుకు చెపుతుంది. అని సరి పెట్టుకున్నారు.

ఆ రోజు భోజనాల దగ్గర అదే మాట ఎత్తారు శివరావుగారు.

"వాళ్ళకు ఈ వేళ ఉత్తరం రాస్తున్నాను. రేపు నేనూ మీ వదిన వెళ్ళిపోతాము. ఇంటి దగ్గర ఇబ్బందిగా ఉందని రమణ ఉత్తరం రాశాడు కదా" శివరావుగారు అన్నారు.

"వదిన నీరసంగా ఉన్నది. ఇక్కడే ఉంటుంది" రాఘవ అన్నాడు.

నేను పురిటికి ఇక్కడికే వస్తానులే. ఈలోగా పెళ్ళి అయిపోనీ" వెంకటలక్ష్మి సమాధానం వినాన్న రాఘవ ఇంకేం అనలేదు.

ఆ మర్నాడే శివరావుగారు, వెంకటలక్ష్మి వెళ్ళి పోయారు.

ఇంకా తాంబూలాలు నాలుగురోజు లున్నాయనగా ఒకరోజు రాఘవ కారు, షెడ్డులో పెట్టి హాలోకి అడుగు పెట్టాడు.

"అమ్మయ్యా! వచ్చేశావా రాఘవా? మేము వచ్చి పదినిముషాలు అయింది. మా చిన్నకొడుకు సూర్యంవాడు." హాల్లో కూర్చునిఉన్న, రామ్ తనతో వచ్చివున్న సూర్యాన్ని పరిచయం చేశాడు.

"మావాడు ఇక్కడకు పెళ్ళిచూపులకు వచ్చాడులే. ఇప్పుడే ఆపని ముగించుకుని వచ్చాము" కాఫీ తాగుతూ అన్నాడు రామ్.

"ఈవ్రా రేనా?" రాఘవ ప్రశ్నించాడు.

"ఆ! అమ్మాయిది ఈవ్రాకే. పెళ్ళి కుదిరిపోయినట్లే. అమ్మాయి బాగుంటుంది. అమ్మాయి వెనకాల డబ్బుకూడా బాగానే ఉన్నది. అమ్మాయి చదువున్నదికాదు. అదే బాధగాఉంది సూర్యానికి. అసలు సూర్యం, ఒక చదువుల సరస్వతిని, లక్ష్మీపుత్రికను, అందాలరాశిని ప్రేమించాడు. ప్రేమించాను అని మోజు పడ్డాడేమో! రెండు నెలల క్రితం ఆ అమ్మాయికి మశూచికంవచ్చి అందం చెడిపోయిం దట. దానితో మనవాడు ముఖం చాటుచేసుకున్నాడు."

తనుచెప్పింది అయినట్లు ఆగాడు రామ్. రాఘవకు ఏదో అనుమానం వచ్చింది.

"ఎవరుట ఆ అమ్మాయి?" అడిగాడు రామ్‌ను.

"ఆ అమ్మాయి పేరు నిర్మలట. లాయరు విశ్వనాథం గారి అమ్మాయి."

రామ్ సమాధానమునకు రాఘవ ఉలిక్కిపడ్డాడు. సూర్యం గుప్పుడు ఇవన్నీ ఎందుకన్నట్టు విసుగ్గా చూశాడు రామ్‌వైపు.

"ఆగవయ్యా బాబూ! అసలువిషయం చెప్పనీ. వీడేం చేశాడో తెలుసా రాఘువా? వీడు, ఆ అమ్మాయి రెండున్నర సంవత్సరాలనుండీ ప్రేమించుకుంటూ హాయిగా తిరుగుతున్నారు. ఇంకొద్ది రోజులలో పెద్దలకుచెప్పి అనుమతి తీసుకుని వివాహం చేసుకుందామనుకుంటున్నారు. ఇంతలో ఈ అవాంతరం వచ్చిపడింది. నిజంగా ప్రేమించిఉంటే ఇలా చేసేవాడా! ఏదో మోజుపడి ఉంటాడు." రామ్ ఆగి సూర్యంవంక చూశాడు.

అతనికీ సంభాషణ అంతగా రుచించలేదు.

"పాపం ఆమె మనస్సు ఎంత బాధపడి ఉంటుందో, నీ తిరస్కారంతో" రామ్ సానుభూతిగా అన్నాడు.

రాఘవకు నిర్మల వదనం గుర్తుకు వచ్చింది. ఆరోజు ఆమె విషాదవదనం చూసి పాపం ఎవరూ పెళ్ళిచేసుకోరేమోనని భయపడుతున్నదేమో అనుకున్నాడు! కాని ప్రేమించిన ప్రియుడు తిరస్కరించినందుకు బాధపడుతున్నదనుకోలేదు తను. ఎలాగైనా సూర్యాన్ని ఒప్పించి నిర్మల పెళ్ళి జరిపించాలి అనిపించింది అతనికి. నయం, ఇంకా తను

ఆమెను పెళ్ళిచేసుకున్నాడుకాదు. పాపం ఆ అమ్మాయి ప్రేమించినవాణ్ణి పొందలేక మరొకతనితో మనుగడచేస్తూ సతమత మయ్యేది. రాఘవ ఆలోచనలనుంచి తేరుకున్నాడు.

"సూర్యం! నువ్వు తప్పుగా అర్థంచేసుకోనంటే ఒక మాట చెప్పనా? నువ్వు ఏమీఅనుకోనంటే చెబుతాను." సూర్యం ముఖంలోకి చూశాడు రాఘవ.

"ఏమీఅనుకోడులే. చెప్పు రాఘవా!" రామ్ తొందర చేశాడు.

"సాధారణంగా మొదట్లో మగవాడుకాని, ఆడదికాని అందాన్నిచూసే ఆకర్షింప బడతారు. ఎక్కడో తప్ప ప్రతి మనిషిలోనూ ఏదో ఒకవిధమైన అందం అను, ఆకర్షణ అను ఉండి తీరుతుంది. ఎటొచ్చి ఒకొళ్ళకందంగా, ఆకర్షణీయంగా కనిపించినది వేరొకరికి అలాగ కనిపించకపోవచ్చు. ఒకొక్కళ్ళనుచూస్తే ఏదో మనకు ఆత్మీయులు అని కూడా అనిపిస్తుంది. ఈ బంధం, ఆకర్షణ, ఆత్మీయతలతో ఏదో ఒక దానివలన లేదా అన్నీ కలిపినందువల్లనో మనం ఒకొళ్ళకొకళ్ళం దగ్గర అవుతాం. ఇటువంటిదే ఒక స్త్రీ, ఒక పురుషుని మధ్యకూడా ఉండవచ్చును. కాని పరిచయం పెరిగిన కొద్దీ అందానికి ప్రాముఖ్యత తగ్గిపోతుంది. హృదయానికి, మనస్సుకు ప్రాముఖ్యత పెరుగుతుంది. దానినే ప్రేమ అని కూడా అనవచ్చు. ప్రేమ ఏ విధంగానైనా ఉండవచ్చును. అందులో ప్రేయసీప్రియుల ప్రేమ చాలా ప్రత్యేకమైనది. అలాగ ప్రేమ పెరిగినకొద్దీ వాళ్ళనడవడికకీ, హృదయానికి విలువనిస్తాయి. అప్పుడు అందం అన్న ప్రసక్తి రానేరాదు.

ఇంతకీ నిర్మల అన్నావే ఆ అమ్మాయి మంచిదేనా? అంటే, నీమనస్సుకు నచ్చిందేనా?"

"మంచిదే..." నసుగుతున్నట్లు అన్నాడు సూర్యం.

"అయినప్పుడు నిజంగా నువ్వు ప్రేమించి ఉంటే ఆమెను వదులుకోవు. అందుచేత సూర్యం! నిజంగా నువ్వు ప్రేమించానన్నావే అది ప్రేమకాదు. మోజు. ఆమె అందం పైన ఆశ. కాని పాపం ఆ అమ్మాయి నిన్ను ప్రేమించిఉంటే ఎంత బాధపడి ఉంటుంది నీ తిరస్కారానికి? ఒకవేళ పెళ్ళి చేసుకున్నాకే ఆ అమ్మాయికి మశూచకం వచ్చి ఉంటే ఆమె అందం తగ్గిపోతే నువ్వు వదిలేసి ఉండేవాడివా? ఒక వేళ నీకే అలాంటిది వచ్చి వికారి వయిపోయావనుకో, ఆమె తిరస్కరించి ఉంటే నీ మనస్సెంత బాధపడి వుండును? నీ స్నేహితుడిగా చెబుతున్నాను. నిర్మలను పెళ్ళిచేసుకుని ప్రేమ అనే పదానికి న్యాయాన్ని చేకూర్చు. ఒకవేళ ఆమెవలన తప్పుంటే నాతో చెప్పు." రాఘవ మాటలతో కాస్త చలించాడు సూర్యం.

"ఇంకా వాళ్ళకు మాట ఇవ్వలేదుగా సూర్యం? బయల్దేరు నిర్మలా వాళ్ళింటికి వెడదాం. పాపం ఆమె ఎంత బాధపడుతుందో! ఒప్పుకో సూర్యం." రామ్ బ్రతిమాలాడు.

"రామ్ తొందరపడకు. విశ్వనాథంగారికి చెప్పి అన్ని ఏర్పాట్లు చేయిస్తాను" అన్న రాఘవ సూర్యం వంక చూశాడు. 'ఏమంటావ్' అన్నట్లు.

"మీఇష్టం" సూర్యం అన్నాడు. రాఘవ సంతోషించాడు. కొద్ది రోజులలోనే సూర్యం, నిర్మలల వివాహం జరిగిపోయింది.

కొద్దిరోజులలో సూర్యం, నిర్మలల పెళ్ళిజరిగిపోయింది. వివాహ సమయంలో రామ్ అడగనే అడిగాడు రాఘవను-

"నీ పెళ్ళి కుదిరిందని విన్నాను అది ఎప్పుడు ?"

"ఎవరు చెప్పారు?" రాఘవ ఎదురు ప్రశ్న వేశాడు.

"ఏమో సరిగా గుర్తు లేదు. కాని పెళ్ళెప్పుడట?" రామ్ మళ్ళీ అడిగాడు.

"లేదు. నేను చేసుకోవటం లేదు" రాఘవ అన్నాడు.

రామ్ ఆశ్చర్యపోయాడు.

"అదేమిటి! పెళ్ళి, తాంబూలాలదాకా వచ్చిన తిరువాత మానుకోవటమేమిటి? అప్పుడు రోజా విషయంలోనూ అలాగే చేశావు" రామ్ చనువుకొద్దీ అన్నాడు.

రామ్ వేపు చూశాడు రాఘవ. అందులో ఏమి అర్థమున్నదో కాని రామ్ ఊరుకున్నాడు.

ఆరోజు రాఘవ విశ్వనాథం గారింట్లో చెప్పాడు. తను పెళ్లిచూపులకు వచ్చినట్లు, నిర్మలతో పెళ్లి ఖాయం చేసుకోబోతున్నట్లు సూర్యానికి కాని, మరెవరికి కాని యెప్పుడూ చెప్పవద్దని. సూర్యాన్ని నచ్చచెప్పి, నిర్మల సూర్యం పెళ్ళి జరిపించినందుకు అతనిమనసు సంతోషించింది.

ఆ విధంగా నిర్మలతో రాఘవ పెళ్లి తప్పిపోవటం, వెంకటలక్ష్మిని ప్రతిటికి తీసుకొద్దామనుకునేలోగానే ఆమె చనిపోవటం జరిగిపోయాయి. కన్నతల్లి లాంటి వదినను రక్షించుకోలేక పోయానే అని బాధ పడ్డాడు రాఘవ.

'గతాన్ని తలుచుకొని ప్రయోజన మేమిటి? ప్రస్తుత కర్తవ్యం ఏమిటో ఆలోచించు రాఘవ' అంతరాత్మ హెచ్చరించింది. దానితో గత స్మృతులకు ఆనకట్ట వేశాడు రాఘవ.

"నాన్నగారూ! మీరు, అన్నయ్యా, పిల్లలూ అంతా వచ్చేద్దురుగాని, ప్రయాణంకండి" శివరావుగారితో అన్నాడు రాఘవ.

"నేను రానుగాక రాను" రమణరావు మొండికేశాడు.

"పోనీలే రాఘవా! నేను భోజనం పెడుతుంటాను. మీ రేం బాధపడకండి. అతన్ని జాగ్రత్తగాచూస్తాను" రాఘవకు పిన్ని వరసయిన ఒకావిడ ఉంది. ఆమె ఆ వూళ్ళోనే ఉంటోంది.

"సరే పిన్నీ! నేను డబ్బు పంపుతుంటాను. అన్నయ్య తేరుకున్నాక స్కూలుకు వెళతాడు. అంతవరకు సెలవు మీదనే వుంటాడు" రాఘవ ఆమెతో అన్నాడు.

ఆ విధంగా రమణరావూ, పిల్లలూ, శివరావుగారూ రాఘవ వద్దకు వచ్చేశారు. చంటి వాడిని మాత్రం శాంత తీసుకువెళ్ళింది. ఓ నాలుగు రోజుల్లో తెలిసి వచ్చింది రాఘవకు పిల్లల్ని క్రమశిక్షణలో పెంచటం కష్టమని.

# 9

"రండి, రండి." లేచి ఎదురు వెళ్ళి ఆహ్వానించాడు బట్టలషాపు యాజమాని రాఘవను చూడగానే. రాఘవకు తెలిసిన వాడే. ఆ సిటీలో ఉన్న పెద్ద బట్టల దుకాణాలలో అది ఒకటి.

మంచి పర్సనాలిటీ, అందంగా, ఠీవిగా ఉన్న రాఘవను చూడగానే కస్టమర్స్, షాపులో పనిచేసే వాళ్ళు ఒక్క నిమిషం అలానే నిల్చుండిపోయారు. అందరూ తననే చూస్తుంటే బట్టల కొట్లో ఒకమూలగా వెనక్కి తిరిగి బట్టలు తీస్తున్న సరోజ వంక చూస్తూ నిల్చుండి పోయాడు రాఘవ. అతనికి ఆశ్చర్యం వేసింది. సరోజ ఇక్కడ పని చేస్తున్నదా! బట్టలు తీసుకుని ముందుకు తిరిగిన సరోజ తనను చూస్తున్న రాఘవను అప్రయత్నంగా చూసింది. ఒక్కక్షణం ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఆ క్షణంలో ఆమె కళ్ళల్లో కొట్టవచ్చినట్లు కనిపించిన మెరుపు, సంతోషం రాఘవకు గిలిగింతలు పెట్టాయి.

తలదించుకుని తన పని చేసుకునేందుకు, మామూలుగా కనిపించటానికి ప్రయత్నించింది సరోజ.

"ఏం కావాలి సార్? ఏయ్ ఎవరక్కడ? అబ్బాయ్ సుందరం. కూల్ డ్రింక్స్ పట్టుకురా అయ్యగారికి."

షాపుయజమాని ఒక అబ్బాయిని కేకేసి చెప్పాడు.

రాఘవకు సరోజతో ఎలాగైనా మాటాడాలని ఉంది. కానీ ఎలాగా అని ఆలోచిస్తున్నాడు. సరోజ ఏమో ఆడవాళ్ళ బట్టల సెక్షనులో పని చేస్తున్నది.

వెంటనే ఒక ఆలోచన తట్టింది అతనికి.

"నాకాక్కడు ఏవో చీరలు కావాలిట. మా వాళ్ళకు ఎలాంటివి తీసుకోవాలని ఆలోచిస్తున్నాను." నెమ్మదిగా నవ్వాడు రాఘవ.

"అదేమిటి సార్! సరోజ అనే ఆమె ఉంది చూశారూ, బాగా సెలెక్టు చేస్తుంది. అమ్మాయ్ సరోజా! బాబుగారి

భార్యకు మంచిరకం కాశ్మీరు చీరెలూ అవీ సెలక్టు చేయి" షాపు యజమాని సరోజ ఉన్న స్థలానికి దారితీస్తూ అన్నాడు.

సీ దొక్క—డ దాపురించాడురా బాబు అనిపించింది రాఘవకు.

"మీరు మీ పని చూసుకోండి. మిమ్మల్నెందుకు కష్టపెట్టటం? నేనే సెలెక్టు చేసుకుంటాలెండి" షాపు యజమానిని పంపించేసి సరోజ ఉన్న స్థలానికి వెళ్లాడు రాఘవ.

"ఏ రకాలు కావాలి?" వ్యాపార సరళిలో అడిగింది సరోజ.

"సరోజా! అలా చెప్పకుండా ఎందుకు వచ్చేశావ్?" నెమ్మదిగా అడిగాడు.

"అవన్నీ అనవసరం ఇప్పుడు. చూడండి, ఇందులో ఏ చీరలు నచ్చుతాయో" ఆమె ముఖం వర్షించడానికి సిద్ధంగా ఉన్న మేఘంలా ఉంది.

"అమ్మాయ్! ఈ చీరలు పేక్ చేయించు" ఒక ముసలతను తను తీసుకున్న బట్టలను చూపించాడు.

"నాకేం తెలుసు ఈ చీరల గురించి?" రాఘవ పైకే అన్నాడు.

"అందుకేనండీ ఆడవాళ్ళనే తీసుకురావాలి. మీరి ప్పుడు పట్టుకు వెళ్లారనుకోండి. మీ ఆవిడ గారికి నచ్చక పోవచ్చు. అందుకని ఒకపని చేయండి. సరోజమ్మను సెలెక్టు చేయమనండి. మా అమ్మాయి లందరికీ ఈమె సెలెక్టు చేసి పెడతారు" ఆ ముసలాయన తనకు తోచిన సలహా నిచ్చి "వస్తాను సరోజమ్మా!" అంటూ వెళ్లిపోయాడు.

రాఘవకు ఒక ప్రక్క నవ్వు వస్తున్నా, సరోజను ఒక ఆట ఆడిద్దామనే చిలిపి వూహ తట్టింది.

"సరోజా! మా ఆవిడ నల్లగా, పొట్టిగా, లావుగా ఉంటుంది. ఏ చీరలు బాగుంటాయో మీరే చూద్దురూ" రాఘవ అన్న మాటలకు సరోజకు లోపల భగభగ మండినట్లయింది.

ఎంత ఎగతాళి తనంటే! రోజా ఎలా ఉంటుందో తనకు తెలియదూ! మనస్సులోనే అనుకుంది సరోజ.

"మీ భార్య ఎలా ఉంటుందో నాకు తెలీదా?" కోపంగా అంది. ఆ మాటలు అంటుంటే ఆమె ముఖంలో అవ్యక్తమైన బాధ కదలాడింది.

"మీరు పొరపడుతున్నారు. నా భార్య నేను చెప్పినట్లుగానే ఉంటుంది. కాని చాలా ధనవంతురాలు. ఒకసారి మా యింటికి రారాదూ. చూద్దురుగాని."

రాఘవ వాలకం, దర్జా చూస్తే బాగా డబ్బున్నట్లుగా ఉంది. మంచి హోదాలో కూడా ఉన్నాడేమో. రోజా కూడా ధనవంతురాలే కదా. ఆ రోజాను కాదని అంద వికారంగా ఉన్న పిల్లను ఎందుకు చేసుకున్నాడో? రోజాతో అతని వివాహం కాలేదంటే మనస్సుకు హాయిగా ఉంది. అది యీర్ష్య కావచ్చు. తనకు ఈర్ష్య! ఛ! పాడుఆలోచనలు! రోజాతో కాకపోయినా మరో సింగమ్మతో అతని వివాహమైపోయింది కదా! పరాయి మగాడి గురించి ఆలోచించటం మంచిదికాదు. రాఘవను తొందరగా వదిలించుకోవాలి. సరోజ ఆలోచనలు సాగిపోతున్నాయి."

మౌనంగా రెండు చీరలు సెలెక్టు చేసింది.

ఒకటి గులాబిరంగు చీరెకు నల్లబోర్డరున్న కాశ్మీర్ సిల్కుచీరే, ఇంకొకటి ఎర్రటి బోర్డర్ మీద సన్నటి జరీ వున్న తెల్ల షిపాన్‌చీరె. వాటికితగ్గ బ్లవుజు ముక్కలుకూడా తెచ్చి అక్కడ పెట్టింది.

ఆమె సెలెక్షను చాలానచ్చింది రాఘవకు. 'ఆ చీరెలు సరోజ కట్టుకుంటే ఎంతబాగుంటుంది.' అని అనుకోకుండా ఉండలేకపోయాడు రాఘవ. సరోజ చీరలు ఏరిపెడుతున్నంత సేపూ రాఘవ ఆమెను కనిపెడుతూనే ఉన్నాడు. ఆమె పైకి యాంత్రికంగా పనిచేస్తున్నా ఆమె మనస్సు అల్లకల్లోలంగా వున్నదని ఆమె ముఖంలో కదలాడే భావాలు, ముఖానికి మాటి మాటికి ముత్యాల్లా పట్టే చెమట బిందువులు స్పష్టం చేశాయి.

"థాంక్స్ సరోజా! ఎప్పుడైనా మా యింటికి రా. ఇదిగో నా కార్డు. అన్నట్లు మీ శ్రీవారినికూడా తీసుకురా."

కార్డు ఆమె చేతిలోపెడుతూ, ఆమె శ్రీవారిని గురించి ఏం చెప్తుందో, అసలు పెళ్ళయిందో లేదో తెలుసుకోవాలనే కుతూహలంతో చూశాడామెవంక.

"సార్ రండి. చీరెలు సెలెక్టు చేసేసుకున్నారా? రండి కూల్ డ్రింక్ తీసుకుందురుగాని. బోయ్! ఆ చీరెలు నీట్ చేయించి కారులోపెట్టు." రాఘవను ఆహ్వానించాడు షాపు యజమాని.

చేతిలో అతనిచ్చిన కార్డు పట్టుకునిఅతను వెళ్ళినవైపే చూస్తూండిపోయింది సరోజ. తర్వాత ఆ కార్డు చూసింది. రాఘవ ఐ. ఏ. ఎస్.! అది చూసి, 'రాఘవ ఐ. ఏ. ఎస్. ఆఫీసరా' అనుకుంది ఆశ్చర్యంగా. అతని భార్య ఎలా

ఉంటుందో? ఒకసారి వెళ్లి చూస్తే. సరోజాలా అతని భార్య కూడా తనంటే యీర్ష్య చెందుతుందేమో. ఈమె కూడా యీర్ష్య చెంది రాఘవకు కనిపించకుండా ఈ వూరునుండి వెళ్ళిపో అంటే! అమ్మో! జరిగిన అవమానం చాలదా?

కారు హారన్‌తో ఆలోచనలనుండి తేరుకుని, చీరెలు మడత పెట్టడం ఆపి బయటకు చూసింది సరోజ. రాఘవ తననే చూస్తున్నాడు. తను చూడాలనే అతను హారను కొట్టినట్టున్నది.

ఆమె కళ్ళతో కలుసుకున్న అతని కళ్ళు ఏదో చెప్పాయి. అనుకోకుండా ఆమె పెదవులమీద చిరునవ్వు చిందింది. బుగ్గలు కెంపులయ్యాయి. రాఘవ డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయాడు. ఆ రాత్రి రాఘవ్‌కు నిద్రపట్టలేదు. సరోజ పెళ్లి చేసుకుందా? ఆమెను తన భార్యగా చేసుకుంటే! ఆ ఆలోచనకు అతనికి నవ్వువచ్చింది. విఘ్నేశ్వరుడి పెళ్లికి వెయ్యి విఘ్నాల్లావుంది.

ఇష్టపడ్డ సరోజను పెళ్ళి చేసుకుందా మనుకున్నాడు. అభిప్రాయ భేదాలు వచ్చాయి. సానుభూతితో నిర్మలను చేసుకుందాం అనుకున్నాడు. కాని అది యింకోలా ఆగిపోయింది. మరి పార్వతి! సరోజా దొకరకం స్వభావమైతే, పార్వతిది మరొకరకం. వదినకిచ్చిన మాటకోసం, వదిన పిల్లలకోసం తను పార్వతిని చేసుకుందా మనుకున్నాడు.

వదిన పోయాక పిల్లల్ని, తండ్రినీ తీసుకువచ్చిన తనకు ఒక్క వారంలోనే తెలిసిపోయింది. పిల్లల్ని పెంచటం చాలా కష్టమనీ అది కూడా ఒక కళలాంటిదనీను. అప్పుడు పార్వతి సంబంధం వచ్చింది. ఒకరోజున తన తండ్రి అన్నాడు.

"అబ్బాయి! పిల్లల్ని పెంచటం చాలా కష్ట మవు తోంది. ఇంట్లో ఆడ దిక్కుండాలి నాయనా!" అన్నారు.

"ఉండాలికాని లేదు. ఏంచేస్తాం?" అన్నాడు తను.

నేడు వదిన పుట్టింటివైపు బంధువులు వచ్చారు. ఆయనకు కూతురుందిట. పిల్ల బాగుంటుందట. బాగా పాడు తుందట కూడాను. కాని చదువుకోలేదట. ఆమెను నీ కిద్దా మని..." తనవంక చూశారు ఆయన. తను మౌనంగా వూరుకున్నాడు.

తన మౌనంతో తన తండ్రికి ధైర్యం వచ్చింది.

"చూస్తున్నావు కదా ఇంట్లో వంట మనిషివున్నా పైన నౌకర్లువున్నా ఎంత కష్టమవుతోందో! మీ పెద్ద వదిన ఉన్నప్పుడు క్రమశిక్షణ ఉండేది. ఎంత మంచిది ఆమె! ఆమె చనిపోయేప్పుడు కూడా నీ గురించే అన్నది. రాఘవని పెళ్లి చేసుకోమనండి. 'రాఘవా వెళ్తున్నా' అంటూనే ప్రాణాలు వదలింది. ఆమె ఆత్మ సంతోషించాలంటే ఆమె పిల్లల్ని సక్రమంగా పెంచి వృద్ధిలోకి తేవాలి." తండ్రి చూసే అంతంతమాత్రమే కదా! పిల్లల కోసమే యింకా ఆ ఉద్యోగం చేస్తున్నాడు. ఏదో డబ్బంటే మీా రందరూ కలిసి పెట్టగలరు కాని పిల్లల ఆలనా, పాలనా ఎవరు చూస్తారు? అదే నువ్వు పెళ్లి చేసుకుంటే నీ భార్య చూసు కుంటుంది. ఈ సంబంధం అయితే బాగుంటుందేమో. ఎందు కంటే అమ్మాయి పెద్ద చదువుకున్నదికాదు. కట్న కానుకలు పెద్దగా ఇవ్వలేరు. అందులో పెద్ద వదినవాళ్ళ వూరట. అందుకని పిల్ల బుద్ధిగా, వినయంగా వుంటుంది. ఈ పిల్లల్ని కూడా జాగ్రత్తగా చూస్తూ మనలో కలిసిపోతుంది."

శివరావుగారికి తెలుసు తనకు పెద్ద వదినంటే చాలా గౌరవమనీ, ఆమె మాటకు, అందులోనూ చనిపోయే ముందు అన్న మాటలకు తప్పక విలువ ఇస్తానని.
ఆయన అనుకున్నట్లే తను "మీ ఇష్టం" అన్నాడు. అప్పుడే పార్వతిని చూశారు. తెల్లగా, బొద్దుగా బాగానే వుంది కాని చదువు లేదు.

అప్పుడే తను విద్యలేక పోయినా వినయవంతురాలైతే చాలు అనుకున్నాడు.

రేపు తాంబూలాలు అనగా, రామ్‌తో తను పార్వతీ వాళ్ళ వూరు వెళ్ళాడు. రామ్ అత్తగారు ఊరు పక్కనే కావడంతో అక్కడే దిగారు. తను సాయంకాలం పొలాల వేపు షికారుగా బయలుదేరాడు. రామ్ తలనొప్పి అని తనతో రాలేదు. పొలాల దగ్గరలో చక్కని పూల తోట కనిపించడంతో అక్కడ కూర్చుండి పోయాడు తను. ప్రశాంతంగా, హాయిగా ఉంది అక్కడ.

"పార్వతీ నన్ను మరిచి పోయావా? ఎలా ఒప్పుకున్నావు ఈ పెళ్ళికి" ఒక మగ కంఠం వినిపించి ఉలిక్కిపడ్డాడు తను. ఎవరా అనుకుంటూ అలాగే కూర్చుండి పోయాడు. తను పెళ్ళాడబోయే పార్వతి కాదు కదా అన్న అనుమానం వచ్చింది తనకి.

"ప్రసాద్! అవన్నీ మరచిపో. ఇప్పుడు నేను శేఖర్ గారి కాబోయే భార్యను." హుంకరించినట్లు అంతలోనే ఆడ కంఠం.

"తను పెళ్ళి చేసుకోబోయే పార్వతి ఈమె కాబోలు

అనుకున్నాడు. ఈమెకూ-కూడా ప్రేమ వ్యవహారం ఉన్నదన్న మాట!

“ఈ రోజు నాకంటే డబ్బున్నవాడు, హోదా కల వాడు భర్త కాబోతున్నాడు కదా అని యెంత మారి పోయావు! ఇన్నాళ్ళూ ‘బావా! నేను ఇంకా ఎదురు చూడ లేను. త్వరగా పెళ్ళి చేసుకో, అంటూ పోరు పెట్టేదానివి, నువ్వు నా భార్య వవుతావని ఎన్నో కలలు కంటూ ఉండే వాడిని. ఈ ఏడాదితో బి. ఏ. పూర్తవుతుంది. నిన్ను నా దాన్ని చేసుకుందా మనుకున్నాను. ఇంతలో పిడుగులాంటి వార్త! రేపే నిశ్చయం జరగబోతున్నదని తెలిసి పిచ్చివాడినై వెంటనే బయలు దేరి వచ్చాను. నీకోసం ఈవేళ నాలుగు సార్లు కబురు చేశాను. ఇంటికి కూడా వచ్చాను. కాని నువ్వు కనిపించలేదు. నా అదృష్టం కొద్దీ ఇప్పుడు కనిపించావు. నీ మనసు మార్చుకో పార్వతీ!” దీనంగా వేడుకుంటోంది మగ కంఠం.

“నాకేమీ తెలియని రోజులలో ఏమైనా అని వుండ వచ్చు. అంతేకాని ప్రేమ లేదు, ఏమీ లేదు. నేను నిన్ను కలుసుకోవటానికి రాలేదు. పూలకని వచ్చాను అనవసరంగా మాట్లాడక వెళ్ళిపో” పార్వతి కంఠం అది.

“నెల్లాళ్ళ క్రితం అన్నమాటలు తెలియనితనం వల్లనా? ఇప్పుడు తెలిసిన తనమా? ఎంత వంచన చేస్తారు మీ ఆడ వాళ్ళు! డబ్బు, హోదా వుంటే ఏమీ అక్కరలేదన్నమాట! ఎన్ని సార్లు ప్రమాణం చేశావు నిన్ను దైవ సాక్షిగా ప్రేమి స్తున్నానని, ఎంత మోసం! రేపు, ఈ కలెక్టర్ గారితో పెళ్ళి అయ్యే రోజు, ఇంతకంటే హోదా, డబ్బు కలవాడు మరో

వ్యక్తివస్తే అతన్ని చేసుకుంటావేమో! ఇష్టపడి చేసుకోవాలి కానీ హోదా, డబ్బు చూసి కాదు."

"గొప్ప ఉపదేశమే చేశావు కాని, నేను వ్రాసిన ఉత్తరాలు నాకిచ్చేయ్."

"పార్వతీ తప్పకుండా ఇచ్చేస్తాను. కాని ఒక్కసారి ఆలోచించుపార్వతీ, ఇప్పటికైనా మనసుమార్చుకుంటే నేను సంతోషిస్తాను. నువ్వు నన్ను కాదంటున్నా నేను వేడుకుంటున్నానని, సిగ్గులేని వాడినని అనుకుంటున్నావుకదూ ? నేను నిన్నెంత ప్రేమించానంటే నువ్వు నాలో ఒక భాగమని, ఆ భాగం ఏదో తప్పు చేయబోతుంటే దిద్దటం నా కర్తవ్యమని అనుకునేంత పిచ్చిగా ప్రేమించాను. ప్రేమిస్తున్నాను. నువ్వు ఎటువంటి దానివైనా, ఎలా మారినా నా ప్రేమను ఎప్పటికీ చంపుకోలేను. నువ్వు ఎక్కడ వున్నా సుఖంగా ఉండాలని ఆత్మీయుడిగాకోరుకుంటున్నాను. కాని ఒక్కమాట, నీభర్తని సుఖపెట్టు, అతని బంధువులను గౌరవంగా, ప్రేమగా చూడు. ఇదంతా ఎందుకు చెవుతున్నానంటే అతన్ని కన్నతల్లిలా చూసిన వదినగారు పోయారు. ఆమె బిడ్డల ఆలనా పాలనకై పెళ్లి చేసుకోవాలనుకున్నాడట. అందుకే చదువులేని పల్లెటూరి అమ్మాయినైనా నిన్ను చేసుకుంటున్నాడు. ఆపిల్లలందర్నీ నీ బిడ్డలాగా పెంచు. అప్పుడే అతను ప్రేమిస్తాడు. గౌరవిస్తాడు. నీ జీవితం పూలబాట అవుతుంది" ప్రసాద్ కంఠం కొద్దిగా వణికింది దుఃఖంతో.

"అవన్నీ నేనూ విన్నాను. కాని చెప్పటానికి సులభమే. చక్కగా పెళ్ళి చేసుకుని, సుఖంగా తిరగాల్సిన వయసులో ఒకపిల్లల కోడిలా వాళ్ళందర్నీ పెట్టుకుని కూర్చోవలసిన కర్మ

నాకేం పట్టింది. కావాలంటే డబ్బు పంపమంటాను. కాని పిల్లల్ని మాత్రం నేను పెంచను" పార్వతి నిర్మొహమాటంగా చెప్పింది.

ఈ మాటలు విన్న రాఘవకు తల తిరిగినట్లయింది. ఆమెను చేసుకోకూడదని, ఆమె ప్రేమ వ్యవహారం, అహంకారపూరితమైన ఆమె మాటలు విన్నప్పుడే అనుకున్నాడు. ఇప్పుడు పెద్ద సత్యం వెల్లడయింది. ఆ రోజు నిర్మలకు అన్యాయం చేయకని సూర్యానికి బోధించాడు తను. మగవాళ్లు ఆడవాళ్ళ మీద మోజుపడి ప్రేమించామంటూ తిరిగి కొన్నాళ్ళ తరువాత వదిలేస్తారు అనుకున్నాడు తను చాలా సార్లు. కాని ఆడవాళ్ళలో కూడా ఇలాంటి వారుంటారన్న మాట! రోజాకు డబ్బు ఉన్నది. గారంగా పెరిగింది. అహంభావం వుండటం సహజం! కాని పార్వతి ఏం చూసుకుని అంత గట్టిగామాట్లాడుతోంది? తనకు తారసిల్లిన రోజా, పార్వతీ ఇద్దరూ అలాంటి వాళ్ళు కావటంతో అందరు ఆడవాళ్లు ఇంతేనా అనిపించింది అతనికి. అతని వ్యూహాపథంలో సరోజ తళుక్కున మెరిసింది. భయంతో బెదిరిపోతూ చూసే ఆ అందమైన నల్లటి కళ్ళు ఒక్కసారిగా గుర్తుకు వచ్చాయి. ఆమెకు పిల్లలంటే ఎంత ఇష్టం! ఎప్పుడూ చుట్టు ప్రక్కల వున్న పిల్లందరూ ఆమె ఇంట్లోనే వుండేవారు.

"సరే నువ్విక్కడే ఉండు. అయిదు నిమిషాల్లో నీ ఉత్తరాలు పట్టుకు వస్తాను. చివరి సారిగా చెబుతున్నాను. అతన్ని, అన్న పిల్లలను జాగ్రత్తగా చూస్తూ అతని ప్రేమను పొందు. అంతే కాని లేనిపోని ఘర్షణలకు పోయి జీవితం

పాడు చేసుకోకు. షికార్లు డ్యూయెట్లూ అనుకోవటానికి ఇది సినిమా కాదు. జీవితంలో కొన్ని బాధ్యతలంటూ ఉంటాయి. అవి సక్రమంగా నెరవేర్చ కలిగిననాడే మనిషికి తృప్తి. అప్పుడే ఇతరులకు ఆ మనిషిమీద ప్రేమాభిమానాలు కలుగుతాయి. కుర్రతనం పోకడలు పోక జాగ్రత్తగా ఉండు. వెళ్తున్నాను." ప్రసాద్ మళ్ళీ హెచ్చరించాడు.

రాఘవకు ఒక్కసారిగా కర్తవ్యం గుర్తుకు వచ్చింది. దూరంగా వెళ్ళిపోయిన సరోజ జీవితాన్ని సరిదిద్దలేక పోయానే అని బాధపడేకంటే ఇప్పుడు పార్వతికి హితబోధ చేసి ఆమె జీవితం సరిదిద్దాలి అనుకున్నాడు అతను.

"పార్వతిగారూ" రాఘవ పిలుపునకు అటు తిరిగి పువ్వులుకోస్తున్న పార్వతి ఇటు తిరిగింది. రాఘవను చూసి నిర్ఘాంతపోయింది.

"మీరా?" ఆశ్చర్యంగా అంది.

"మీరూ, ప్రసాద్ మాట్లాడుకున్నవన్నీ విన్నాను. సంభాషణనుబట్టి అతను చాలా మంచివాడు. సంస్కారం కలవాడు అని బోధపడింది. అతనిని పెళ్ళిచేసుకుని సుఖపడండి. ఇది చెప్పటానికే నేను పిలిచింది. రేపు అతనితో నిశ్చితార్థం అయితే బాగుంటుంది. నేను మిమ్మల్ని ఎలాగూ చేసుకోను."

"ఎందుకు చేసుకోరు?" కోపంగా అడిగింది.

"ఎందుకు చేసుకోనంటున్నానో మీకు తెలియదా? తెలియకపోతే చెప్తా వినండి. ప్రసాద్‌ను ప్రేమించినట్లు నటించి మోసపుచ్చుతున్నారు. మరొకవిషయం ఏమిటంటే, మా వదిన బిడ్డల్ని కన్నబిడ్డల్లాగ చూడగలిగే ఆమెనే నేను

పెండ్లి చేసుకోదలచాను. ఆ బరువు బాధ్యతలు మీ వల్ల కాదని తెలిసిపోయింది. అందుకని ప్రసాద్‌ను వదులుకోకండి. అతను వచ్చే టైము అయిందికాబట్టి 'నిన్నే చేసుకుంటాను' అని అతనికి చెప్పండి. లేకపోతే రెంటికీ చెడ్డ రేవడి చందం అవుతుంది. మళ్ళీ అంతగా ప్రేమించే మంచి మనసున్న మనిషి మీకు దొరకక పోవచ్చు. వస్తా."

"పార్వతీ! ఇవిగో నా ఉత్తరాలు"అంటూ వచ్చాడు. ప్రసాద్ పార్వతిప్రక్కన రాఘవనుచూసి ఎవరన్నట్లు చూశాడు.

"ప్రసాద్ గారూ! నేను రాఘవను. తెలిసో తెలియకో పార్వతిగారు మిమ్మల్ని ఎన్నో అన్నారు. తెలియని వయస్సు కాబట్టి ఆమెను మన్నించి పెళ్ళి చేసుకోండి. నా మాటమీద గౌరవం ఉంచండి మీరిద్దరూ."

అంటూ బయలేరటానికి రెండడుగులు వేశాడు రాఘవ. "మీరు దీవించండి మమ్మల్ని" పార్వతిచేయి పట్టు కుని రాఘవ దగ్గరకువచ్చి నమస్కరించాడు ప్రసాద్.

పార్వతికూడా బొమ్మలా అనుసరించింది ప్రసాద్‌ను. చిరునవ్వు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు రాఘవ.

పార్వతితో ఈ విధంగా తన పెళ్ళి తప్పిపోయింది. సరోజకు పెళ్ళి అయి ఉండకపోతే, ఆమె ప్రియుడెవరో కను క్కొని అతన్ని తెచ్చి పెళ్ళిచేయాలి. నిజంగా సరోజపెళ్ళి ఆమె ప్రియునితో జరిపించగలగాలి! ఆ మాట తలుచుకుంటే గుండెల్లో పదునైన సూది గుచ్చినట్లున్నదే, తనెంత నేరి వాడు! సరోజకీపాటికి పెళ్ళి అయిపోయి ఉంటుంది.

# 10

"ఆగు! సరోజా! ఇక్కడి కెలావచ్చావు ఫ్లాట్లోనే వుంటున్నావా?" షాపునుండి తలవంచుకుని ఇంటికి వెళ్తున్న సరోజ, రోజా కంఠంవిని ఉలిక్కిపడి తల ఎత్తింది. రోజా ఎంత మారిపోయింది! లావెక్కింది. లావెక్కదామరి? పంచ భక్ష్య పరమాన్నాలూ ఆరగించి పట్టుసోఫాల్లో కదలకుండా కూర్చుంటే ఏమవుతుంది. వేషం మాత్రం మారలేదు. లిప్‌స్టిక్, పెద్దముడి, అలంకరణంతా ఇదివరకు లాగానే ఉంది. సరోజ మెదడులో ఏవో ఆలోచనలు. రోజాను చూస్తూనే సరోజ ఏదో పులినిచూసినట్లు భయపడింది.

"ఏమిటి నన్నుచూసి భయపడ్తున్నావా?" పెద్దగా నవ్వింది రోజా.

రోడ్డుమీద నిలబడి మాట్లాడటానికే అదోలా అని పిస్తున్న సరోజకు ఆమె నవ్వుచూసి మరీ అసహ్యం వేసింది.

"అబ్బే! నేనేం భయపడటంలేదు." తలదించుకుని మెల్లిగా అంది సరోజ.

"నువ్వు చెప్పనవసరంలేదు. నీ కళ్ళే చెబుతున్నాయి, నువ్వు భయపడుతున్నావని. రాఘవలాంటి మేకవన్నె పులుల్ని చూసి భయపడాలికాని, నన్ను చూసెందుకు. ఆరోజు నిన్ను వారించి వెళ్ళిపొమ్మన్నాను. నువ్వు వెళ్ళిపోయాక ఎంతో బాధనిపించింది. నిశ్చితార్థంవరకూ వచ్చాక నన్ను చేసుకోనన్నాడు రాఘవ. నన్నేకాదు అలా ఇంకో

యిద్దరు అమ్మాయిలతో కూడా అయిందిట! నిశ్చితార్థం వరకూ వచ్చిన పెళ్ళి చెడిపోతే సన్నెవరైనా చేసుకుంటారా? ఏదో మా ఆయన మంచివారు కాబట్టి సరిపోయింది." ఆఖరి మాట తననితాను వంచన చేసుకోవటం అని రోజాకు తెలుసు! తన భర్తకు ఎంతోమంది స్త్రీలతో సంబంధమున్నది. మొదట్లో కొన్నాళ్ళు రోజా దెబ్బలాడేది కాని లాభం లేక పోయింది. "నీ కిష్టముయితే ఉండు, లేకపోతే పో" అంటున్నాడు గోపాల్. తనేంచేస్తుంది? అటు తండ్రిపోయాడు. ఆ సిక్కి మించిన అప్పులు. తండ్రి నుంచానపడ్డప్పుడు బయటపడ్డాయి? ఆస్తంతా అప్పులవాళ్ళు పట్టుకుపోయారు. తనకు ఏ అండ వున్నదని గోపాల్‌తో దెబ్బలాడుతుంది! ఉద్యోగంచేసి స్వతంత్రంగా బ్రతుకుదామంటే ఉద్యోగం యిచ్చేవారెవరు. ఇచ్చినా స్వతంత్రంగా, ఒంటరిగా బ్రతుకు వెళ్ళదీయాలంటే కాకుల్లాంటి లోకులు వూరుకుంటారా? రోజా మనస్సు బాధతో విలవిల్లాడి పోయింది.

రోజా మాటలకు సరోజ ముఖం జేవురించింది.

రాఘవ అంత మోసగాడా? అనుకుంది మనసులోనే. సరోజ ముఖంలోని మార్పులు కనిపెట్టింది రోజా. అగ్నికి ఆజ్యంపోయాలి అనుకుంది ఆమె.

"ఈ వూళ్ళోనే ఉన్నాట్ట! రామ్ చెప్పాడు. ఇప్పుడు కలెక్టరుకూడా కదా. ఇంకా ఎంతమంది అమ్మాయిలను చేసుకుంటానని చెప్పి మోసం చేస్తాడో?" రోజా మాటల్లో ఈర్ష్య కొట్టవచ్చినట్టు కినిపించింది.

సరోజముఖం వివర్ణమయింది. ఆమెకు అక్కడనుంచో బుద్ధికాలేదు.

"ఇవన్నీ నీ కెవరు చెప్పారు?" నీరసంగా అడిగింది సరోజ.

"రామ్ చెప్పాడు. పోనీలే! అతనికి దూరంగావచ్చి బ్రతికిపోయావు. అతను కనిపిస్తే, మాట్లాడించబోతే జాగ్రత్తగా ఉండు" సరోజ ముఖకవళికలను పరిశీలిస్తూ చెప్పాకు పోతోంది రోజా.

"వస్తాను" సరోజకు గోడ్డుమీద మాట్లాడటం ఇష్టంలేదు. ముఖ్యంగా రోజా చెప్పేమాటలు నమ్మలేక, నమ్మకుండా వుండలేక ఆ మనస్సు అల్లకల్లోల మయింది. గబగబా వెళ్ళిపోయింది.

"అది చూసి ఆనందంగా ఊపిరి పీల్చుకుంది. ఆమె తలలో వేయిరకాల ఆలోచనలు. ఏమైనాసరే సరోజ రాఘవకు దక్కకుండా చేయాలి. సరోజ తనకు బద్ధ శత్రువులాంటిది. ఆమె కలెక్టరుగారి భార్య కాకూడదు. అయితే రోజా అంతరాత్మ ఎదురు తిరిగింది. 'పాపం సరోజ ఏమి అపకారం చేసిందని నీకు? ఆమె నీ కంటే అందగత్తె అని అసూయ నీకు?' కాని రోజా అంతరాత్మను నొక్కిపట్టింది.

సరోజ జీవితం ఎవరితోనైనా ముడిపడనీ, కాని రాఘవతో మాత్రం కాకూడదు! తనకు తెలుసు. రాఘవ తనని మర్చిపోలేడు. ఒకవేళ సరోజను చేసుకుంటే ఆమె సహనడితో అందంతో అతడ్ని తనవాడ్ని చేసేసుకుంటుంది. రాఘవ తననే తలుచుకుంటూ జీవితాంతం గడపాలి. అప్పుడే తనకు తృప్తి. అంతేకాని సరోజ రాఘవలు పెళ్ళి చేసుకుని చిలకా గోరింకల్లా సంసారం సాగిస్తుంటే తనమనసు విలవిల్లాడిపోదూ!

సరోజకు నిద్రే పట్టలేదు. రెండురోజుల క్రితం రాఘవ తను పని చేస్తున్న దుకాణానికి రావటం. నిష్కల్మషంగా తనతో ప్రవర్తించడం. మళ్ళీ ఈరోజు అతనికింకా వివాహం కాలేదని రోజా మాటలు! అతనికింకా వివాహం కాలేదని రోజా మాటలవలన తెలిసిందిఎందుకో తనకి సంతోషంగా ఉంది.

కాని అతడు మోసగాడు అన్న రోజా మాటలకు తన ప్రాణం గిలగిల్లాడుతోంది. అతను నిజంగా చెడ్డవాడా? తనని కూడా వలలో వేసుకుందా మనుకున్నాడా? ఛ? అలా ఎన్నటికీ కాదు. అతనలాంటి వాడు కాదని తన మనసు ఘోషిస్తోంది. అతని మీద తనకు చాలా నమ్మకం ఉంది. అయినా మరోక వేపు అపనమ్మకం కూడా తలెత్తింది. పిచ్చిదానా ఇలాగే ఆడవాళ్ళు మోసపోయేది! మగవాళ్ళని గాఢంగా నమ్మేస్తారు. మగవాళ్ళు నట్టేట్లో ముంచేస్తారు. అలా మునిగి పోతూ కూడా వాళ్ళనే నమ్ముతుంటారు. అదే ఆడవాళ్ళ బల హీనత! అతనెలాంటివాడో నీకేం తెలుసు? అతనితో నీ పరిచయం ఏపాటిది? అతనికి దూరంగా ఉండు లేనిపోని ఉచ్చులు మెడకు తగిలించుకోకు! వివేకం బోధించింది. అలా రాత్రంతా గడిపిన సరోజకు మర్నాడు భారంగా అనిపించింది. అయినా పని తప్పదుకదా అని దుకాణానికి బయలు దేరింది.

"ఏమిటి ఇక్కడె నిలబడ్డావు? పద, కారెక్కు. ఇంటి దగ్గర దింపుతాను" సరోజను ఏకవచనంతో పిలుస్తున్నానన్న సంగతి కూడా మరచి పోయాడు రాఘవ.

రాఘవ కంఠం విని ఉలిక్కిపడి చూసింది సరోజ.

అతను తన వెనకాలే ఉన్నాడు! అతను తననుద్దేశించే అన్నాడా ఆ మాటలు అన్నట్లు అతని ముఖంవంక చూసింది. అతని కళ్ళు ఆజ్ఞాపిస్తున్నట్లు చూశాయి.

ఆమె ప్రొద్దుట తలభారంతో దుకాణానికి వెళ్ళింది అక్కడ పని ముగించుకుని ఇంటికి బయలుదేరింది. కొంచెం దూరం నడిచిందో లేదో హోరున వర్షం ప్రారంభమయింది. వెంటనే ఒక హోటల్ ముందర చెట్టుఉంటే దానిక్రింద నిల బడింది. ఆమె అలా అక్కడ నిలుచుని వుండటంతో అనేక మంది మగవాళ్ళకు గిలిగింతగా ఉంది. అంత అందమైన అమ్మాయి. హో రు మ నే వా న లో నంటరిగా, ఆ హోటల్ దగ్గర నిలుచోటం వాళ్ళకి చాలా సరదాగా ఉంది. సరోజ ఇవేమీ గమనించలేదు. ఆమెకు క్రితం సాయంత్రం రోజా మాటలే గింగురుమంటున్నాయి. రాఘవ ఏమయితే నాకేం అని, ఎంత సరిపెట్టుకుందామనుకున్నా ఆమె మనసును సమాధాన పరుచుకోలేక పోతున్నది. ఆలోచనలలో ఇవేం ఆమె గమనించటం లేదు. అదే సమయంలో అటు వెళుతున్న రాఘవ కంటపడింది.

ఛ! ఏం మనిషి! వానయితే మాత్రం వెళ్ళిపో కూడదూ? లేదా జబర్దస్తీగా హోటల్లోకి వెళ్ళి ఫామిలీ రూంలో కూర్చుని ఏదైనా తింటూ కూర్చోకుండనూ? హోటల్ముందు ఆమె అలా నిల్చుని వుండటం అక్కడ నిల్చున్న వాళ్ళంతా ఆమెను అలా చూడటం అతనికి కోపం తెప్పించింది. అందుకే వెనకా ముందు ఆలోచించకుండా కారెక్కమని ఆజ్ఞాపించాడు.

కోపంతో ఎర్రగా కందిన అతని ముఖాన్ని మాటల్లో

అధికారాన్ని చూసి మొదట నిస్త్రాణపోయిన సరోజకు పరిస్థితిని అర్థం చేసుకునేందుకు ఒకనిమిషం పట్టింది. ఏదో తప్పు చేసిన దానిలా ముడుచుకుపోయింది. వెంటనే కారెక్కింది. ఆమె భయపడిందని ఆమె కళ్ళు చూడగానే తెలుసుకున్న రాఘవ పిచ్చిపిల్ల అనుకుని మనసులోనే నవ్వుకున్నాడు.

"అక్కడ నిలబడితే ఏం బాగుంటుంది? అక్కడ చేరిన మగాళ్ళందరూ ఎలా చూస్తున్నారో చూడు" అనునయంగా చెప్తున్నట్టున్నాయి అతని మాటలు.

అయినా ఈ మగవాళ్లు ఆడది ఒంటరిగాకనిపిస్తే, అంత చులకనగా ఒక ఆట వస్తువును చూసినట్లు చూస్తారెందుకో! సమాన హక్కులు ఇవ్వాలంటూ వేదిక లెక్కి ఉపన్యాసాలిస్తారు. చెట్టు క్రింద వాన వస్తున్నదని నిలబడింది. అక్కడ నిలబడిన మగవాళ్ళందరూ రక్షణకోసమేకదా. అలాంటప్పుడు తనని ఏదో వింత వస్తువును చూసినట్లు నఖశిఖ పర్యంతం పరిశీలించటం, తనేదో తప్పు చేసినట్లుగా అందరూ తనవేపే చులకనగా చూడటం ఎందుకు? పుట్టినది మొదలూ చచ్చిపోయే దాకా స్త్రీకి పురుషుడి అండవుండాలనీ, కట్టుబాట్లలో పెరగాలనీ అంటారు. సినిమా కథల్లో, సినిమా పాటల్లో, నవలల్లో అన్నిటిలోనూ ఇదే కనిపిస్తుంటుంది. ఈ కట్టుబాట్లు, నీతి నియమాలు మగవాడికి అక్కరలేదా? కొంచెంస్వతంత్ర భావాలు కల స్త్రీని చూస్తే సమాజం గుసగుస లాడుతూంది ఏతప్పూ చేయకుండా స్వతంత్రంగా, తనంతట తను స్త్రీ ఎందుకు బ్రతుకలేక పోతున్నది? ఈ సమాజపు సంకెళ్ళకు మగవాళ్ళ విషపు చూపులకు భయపడటం వల్లనే కదా!

"ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావు సరోజా!" ఆప్యాయంగా పలకరించాడు రాఘవ.

అతని మాటలతో సరోజ ఆలోచనలకు అంతరాయం కలిగింది. కారు ఎటు పోతుందో అన్న ఆలోచన అప్పటికి వచ్చింది ఆమెకు.

"మా ఇల్లు ఈ సందులోనే ఆపేయండి" అంది కారు డ్రైవ్ చేస్తున్న రాఘవతో

"మా యింటికి తీసుకు వెడతాను, చూస్తువు గాని.

తను ఆమెతో అతి చనువుగా మెలగటం లేదుగదా అని లోపల అనుకుంటూనే అన్నాడు రాఘవ.

"వద్దు. దయచేసి యిక్కడ ఆపండి కారు."

ఆమె అంతదీనంగా ఎందుకు అడగాలో అర్థంకాలేదు రాఘవకు.

"సరే, మీ ఇంటి దగ్గరే దింపుతాను, ఇక్కడే ఎందుకు ఇల్లెక్కడో చూపు. ఇల్లు నేనుచూడకూడదా?" సరోజ ఇంటిదగ్గర కారుఆపుతూ అన్నాడు రాఘవ. అప్పటికి వాన చాలామట్టుకు తగ్గిపోయింది. ఒకటి రెండు చినుకులు సన్నగా పడుతున్నాయి.

సరోజ కారుదిగి థాంక్స్ చెప్పి వెళ్ళిపోతుంటే రాఘవ ఆశ్చర్యపోయాడు. మాట వరసకైనా లోపలికి రమ్మని ఆహ్వానించలేదు. వెడితే ఏం చేస్తుందో అనే పట్టుదల వచ్చింది రాఘవకు.

వెంటనే కారులాక్ చేసి దిగి ఆమె వెనకాలే లోపలకు వెళ్ళాడు. తన వెనకాలే గుమ్మంలో అడుగుపెట్టిన రాఘవను చూసి ఆశ్చర్యపోయింది.

"రండి" అనక తప్పిందికాదు సరోజకు.

"నువ్వు రమ్మనకపోయినా వచ్చాకదూ!" పైకి నవ్వుతున్నా లోపల బాధగానే ఉంది రాఘవకు.

ఒక్కటేగది అయినా పొందికగా సర్ది ఉండటంచేత విశాలంగా, నీటుగా కనిపిస్తోంది. తను ఇచ్చిన వీణ ఒక మూలగా పెట్టివుంది. దానిమీద గ్రీన్ సిల్కుబట్ట కప్పింది సరోజ. ఎంతో ప్రశాంతంగా ఉన్న ఆ గదిని చూసేసరికి సరోజ ఎక్కడవున్నా ప్రశాంతంగా, అందంగా, ఆనందంగా ఉంటుందేమో అనిపించింది రాఘవకు. అందుకేనేమో 'యింటినిచూసి యిల్లాలినిచూడు' అన్నారు పెద్దలు అనుకున్నాడు.

"కాఫీ తీసుకోండి" అన్న సరోజ మాటలతో యింటిని పరిశీలించటంమాని కాఫీఅందుకున్నాడు. "అందరూ బాగున్నారా?" ఏం మాట్లాడాలో తెలియక నిశ్శబ్దాన్ని భరించలేక, అతని చూపులు తట్టుకోలేక అడిగింది సరోజ.

"అంతా అంటే?" అర్థం కానట్లు అడిగాడు రాఘవ.

"అదే మీ భార్య, అందరూ" సరోజ అడగాలనే అడిగింది.

అతనికి గుర్తుకు వచ్చింది. సరోజ తన భార్యకని చీరెలు సెలెక్టుచేయటం. అతని పెదిమలు విచ్చుకున్నాయి. సరోజను ఏడిపించాలనే కొంటెపూహ మళ్ళీవచ్చింది అతనికి.

"ఆ, మా ఆవిడ నిన్నోసారి తీసుకు రమ్మంది" ఆమెను పరీక్షగాచూస్తూ అన్న రాఘవకు ఆమె ఎంతో చిక్కిపోయినట్లుగా, పాలిపోయినట్లుగా కనిపించింది.

"అలా ఉన్నావేమిటి? సరోజా? ఒంట్లో బాగా

లేదా?" పైకి అలా అడిగినా లోపల 'ఏం సరూ! అలా వున్నావ్!' అని ఆమెను దగ్గరకు తీసుకుని, ముఖంమీదపడే ముంగురులను సరిచేస్తూ ఆమె తలను తనగుండెల కానించుకుని 'నేనున్నాను నీ కెందుకీ బాధలన్నీ' అని లాలించాలనిపించింది.

సరోజకు రోజా మాటలే గుర్తుకు వస్తున్నాయి. పెళ్ళికాలేదని రోజా చెప్పింది. అయినట్లు రాఘవ చెబుతున్నాడు. ఎందుకు అబద్దాలుచెప్పాలి అనిపించింది సరోజకు. వెంటనే ఆమె ముఖకవళికలు మారిపోయాయి. ఆమెనే పరిశీలిస్తూ చూస్తున్న రాఘవ ఆమె ముఖంలోని మార్పులు చూసి ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి సరోజా అలాగ అయిపోయావు? నేనేమైనా బాధ కలిగించానా నీకు" అడిగాడు రాఘవ.

అతను సరోజపెళ్ళి అయిందో లేదో తెలుసుకోవాలని వచ్చాడు.

ఆమెకు పెళ్ళి కాలేదని తెలిసిపోతూనే ఉంది. అందుకతనికి సంతోషంగా ఉంది. ఇప్పుడే సరోజకు అన్నీ చెప్పాలి అనుకున్నాడు. రోజాను తను ఎలాగు చేసుకోలేకపోయినదీ, తరువాత వదిన మాటలకు విలువయిచ్చి నిర్మలను చేసుకుందా మనుకుంటే అది ఎలా తప్పిపోయినదీ, తర్వాత పార్వతి విషయం చెప్పాలని అనుకున్నాడు. అన్నీ చెప్పి 'నీకోసమే సరూ అవన్నీ తప్పిపోయింది. అందుకే అంతా మనమంచికే' అన్నారు అందామనుకున్నాడు. కాని సరోజ ముఖంలోని క్రోధఛాయలుచూసి ఆగిపోయాడు.

"ఏమిటి సరోజా అలావున్నావు?" ఆందోళనగా

అన్నాడు. ఆమె ముఖంలో కోపం, అసహ్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి.

"ఎలా ఉన్నానని? మీరు ఎంతమంది అమ్మాయిల జీవితాలతో చెలగాటం ఆడాలనుకుంటున్నారు? ఎంత మందిని వంచిస్తారు? ఎందుకిలా అమాయికులైన ఆడపిల్లల్ని వంచించాలి? మిమ్మల్ని ఎంతో ఉన్నతంగా ఊహించుకున్నాను! ఆ వ్యూహాలన్నీ తప్పని తెలియగానే నాకు చెప్పలేని ఆవేదన..." దుఃఖంతో ఆమె గొంతు పూడిపోయింది.

"ఏమిటి నీవు మాట్లాడేది?" నిర్ఘాంతపోతూ అన్నాడు రాఘవ.

"ఆడదంటే ఒక ఆటవస్తువని మీ ఉద్దేశం! అబ్బా నేనేం మాట్లాడలేక పోతున్నాను. ప్లీజ్ మీరు మళ్ళీ ఎప్పుడూ ఇక్కడకు రాకండి." ఆవేశంగా అరిచింది సరోజ.

ఆమె మాటలకు నిశ్చేష్టుడైనాడు రాఘవ. తుది మొదలూ అర్థం పర్థం లేకుండా ఉన్న ఆమె మాటలు అతనికి బాధకలిగించాయి.

'మీ ఆడవాళ్ళే ఎంతకైనా తగినవాళ్ళు. ముగ్గురు ఆడవాళ్ళు నిజాన్ని కప్పిపుచ్చి మోసంతో నన్ను పెళ్ళి చేసుకుందా మనుకున్నారు. నువ్వూ వాళ్ళలాంటి దానివే. మోసపుచ్చేది నేనా? నువ్వు రమ్మని బ్రతిమాలినా నేను రాను' రాఘవ మాటలు పెదివిదాటి రాలేదు.

కాలుజారితే తీసుకోవచ్చు కాని, నోరుజారితే తీసుకోలేం అనుకుని ఆమె ఏం మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా, ఆగకుండా గబగబా వెళ్ళిపోయాడు రాఘవ.

అతను వెళ్ళిపోతాడనుకోలేదు సరోజ. ఏమిటి? 'ఎవర్ని వంచించాను' అని అతను అడుగుతాడు అనుకొంది.

తను రోజా చెప్పినవన్నీ చెప్పాలి అనుకుంది. అతి నప్పుడు దగ్గరగా తీసుకొని 'అవన్నీ అబద్ధాలు సరూ! నీ మీదే నా ఆశలన్నీ, నీకోసం ఎంత తపించిపోయానో తెలుసా? ఆ సంబంధాలన్నీ తప్పించుకుంటున్నది నీ కోసమే కదా' అంటాడని ఆశించిన ఆమెకు నిరాశే ఎదురైంది.

నిజంగా వాళ్ళందర్నీ వంచించాడేమో? తప్పు అతనిది కాబట్టి నోరు మూసుకుని వెళ్ళిపోయాడు. ఎంత అపోహ పడింది తను! ఇన్నాళ్ళూ అతడేదో దేవుడిలాంటి వాడనుకొంది. ఆ నమ్మకం వమ్మయి పోయేసరికి ఆమెకు పట్టరాని దుఃఖం వచ్చింది. వెక్కి వెక్కి ఏడుస్తూ మంచం పైన పడి పోయింది.

ఇంటికి వచ్చి రాఘవ ఎంతో బాధ పడ్డాడు. సరోజ తనని దుష్టుడు, మోసగాడు అని ఎందుకనుకోవాలి? ఆ పెంకు చేయగలిగినంతలో మేలే చేశాడు. కాని హాని చేయలేదు కదా! ఆడవాళ్ళను నమ్మరాదు అన్నమాట నిజమేనేమో ?

# 11

"హల్లో రాఘవా! బాగున్నావా?" అనుకోకుండా హఠాత్తుగా వచ్చి ప్రశ్న వేసిన రామ్‌ని చూచి", "ఏమిటి

చెప్పా పెట్టకుండా వచ్చావ్. రా. రా." అంటూ ఆహ్వా నించాడు రాఘవ.

"ఏమిటిలా చిక్కిపోయావు రాఘవా?" అసలు విషయం రాఘవకు తెలుసునేమో, అందుకే అలా బాధ పడుతున్నాడేమో అనుకుని అడిగాడు రామ్.

సరోజ అన్న మాటలు పదేపదే గుర్తుకు వచ్చి మన సంతా వెలితిగా ఉంటోంది. నాలుగు రోజులనుండి భోజనం సరిగా చేయలేకపోతున్నాడు రాఘవ. ఏమీ మాట్లాడ కుండా మౌనంగా ఉండిపోయాడు.

"రోజా ఆరోగ్యం దెబ్బతింది రాఘవా" రామ్ మాటలకు ఉలిక్కి పడ్డాడు రాఘవ. సరోజ అన్నాడా? రోజా అన్నాడా? అన్న సందిగ్ధంలో పడ్డాడు. రోజా గురించి రామ్ చెప్పటానికిగానీ, తన వడగటానికి గానీ ఏమీ లేదు కదా! ఆమెమీద అధికారంగానీ, ఆమెతో ఏ రకమైన సంబంధం కానీ లేదు కదా! ఆమె గురించి అయితే రామ్ తనకు చెప్పటమెందుకు? 'అయితే సరోజ మీద నీ కధికారం ఉందా' అతని అంతరాత్మ వేసిన ప్రశ్నకు కలవర పడకుండా ఉండలేకపోయాడు రాఘవ.

రోజాని రమ్మని ఉత్తరం వ్రాసింది. వెళ్ళాదాంలే అను కుంటూ నిర్లక్ష్యం చేశాను. మొన్న అర్జంటుగా రమ్మని టెలిగ్రాం ఇచ్చింది. అందుకే నేను వచ్చింది. నన్ను చూడ గానే భోరుమని ఏడ్చేసింది. ఆమెకు పిల్లలు పుట్టరని డాక్టర్ చెప్పిందట. ఆమెను సరిగా చూడటం లేదుట. పిల్లలు పుట్టరని తెలిసిన తాగాక, ఇంకో అమ్మాయిని

చేసుకుంటాననీ ఒకటే గొడవ పెడుతున్నాడట భర్త. ఇంటి పట్టున ఎప్పుడూ ఉండడట. ఇవన్నీ చెప్పి ఏడ్చింది. ఎంతో వయసు పెరిగిన దానిలాఅయింది. తరువాత నౌకరు చెప్పాడు. ఒక్కోసారి అందర్నీ తిడుతుందట. ఒక్కోసారి అడగని వాడిదే పాపం అన్నట్టు అన్నీ పెడుతుందట. ఒక్కోసారి గట్టిగా నవ్వి ఏడుస్తుందట. ఆమెను చూస్తుంటే చాలా బాధగా ఉంది."

'ఇదంతా నేను చేసిన పాపం రామ్. సరోజను వెళ్ళ గొట్టాను. రాఘవను అనరాని మాట లన్నాను. ఈమధ్య సరోజ కనిపిస్తే ఆమె రాఘవకు ఎక్కడ దక్కుతుందోనని, రాఘవ ఆడపిల్లల్ని వంచిస్తున్నాడని చెప్పాను. ఇవన్నీ కాకుండా గోపాల్ వలన ఒకామెకు కొడుకు పుట్టాడు. ఆ పసికందుని మా కంపౌండులో వదిలి 'ఈ అబ్బాయిని జాగ్ర త్తగా పెంచకపోతే నా ఉసురు తగులుతుంది' అంటూ రాసింది. అదిచూసి, గోపాల్‌కు ఆ బాబుమీద వాత్సల్యం కలుగుతుందేమోనని భయంతో ఎవరికో ఇచ్చేశాను. ఇన్ని పాపాలు చేసిన నన్ను దేవుడుకూడా ఊరికే వదులుతాడా, రామ్? గోపాల్ చేసే పాపాలకు అతనికి తగలాల్సిన ఉసురు కూడ నాకే తగిలింది. ఇద్దరి పాపఫలితాలు నేనే అనుభ విస్తున్నాను. అతనేమో సుఖపడుతూనే ఉన్నాడు. ఇదెక్కడి న్యాయం? అంటూ మొదట మెల్లిగా పశ్చాత్తాప స్వర శిలో మొదలు పెట్టి ఆఖరికి ఆవేశంతో వూగిపోయిం దనుకో. నాకు నిజంగా సరోజా పరిస్థితి చూస్తుంటే చాలా భయంగా ఉంది రాఘవా!" రామ్ సరోజా తనకు చెప్పిన వన్నీ రాఘవకు చెప్పాడు.

రాఘవ మనసు రోజా గురించి ఆలోచించటం లేదు. సరోజను రోజా వెళ్ళగొట్టిందా? మళ్ళీ సరోజ ఇక్కడ కని పిస్తే తనమీద లేనిపోనివన్నీ చెప్పిందా? ఆమె అలాచెప్పటం వలన సరోజ తనని అపార్థం చేసుకుని ఆరోజు అలా మాట్లాడి వుంటుంది. రోజా సరోజను వూరినుండి ఎందుకు వెళ్ళ గొట్టిందో ?

అదే అడిగాడు రామ్‌ను రాఘవ.

"రాఘువా! ఏమనుకోనంటే చెబుతాను సరోజ వలన నువ్వు రోజాకు దూరం అవుతున్నావేమో అనుకున్నాను. అందుకే సరోజ దగ్గరకు వెళ్ళి చెప్పాను, 'రోజాను తీసుకు వస్తాను. నీకూ, రాఘవకు ఎట్టి సంబంధం లేదని చెప్పమని. కాని రోజా, తీరా వెళ్లాక ఆమెను వెళ్ళిపొమ్మని కోరింది. దాంతో సరోజ ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయింది. సరో జను హెచ్చరించింది. ఈ విషయం నీతో చెప్పవద్దని. అప్పుడు అలా జరుగుతుందనుకోలేదు" రామ్ అన్నాడు.

"అంటే జరుగుతుందనుకుంటే అలా చేయకపోయే వాడి వన్నమాట. పాపం అమాయకురాలు సరోజ. ఆ అమ్మాయి ఏమి అపకారం చేసింది మీకు? కాకపోతే, రామ్ నేను దురదృష్ట వంతుడిని. నా ప్రాణమిత్రుడు రామ్ నన్నింతో అర్థం చేసుకున్నాడని పొంగి పోయేవాడిని. నీకు నా మీద నమ్మకం లేదంటే నాకెంత బాధ! సరోజ వెళ్ళి పోయిన తర్వాతనైనా ఈ విషయం ఎందుకు చెప్పలేదు? కనీసం రోజా పెళ్ళి అయిన తర్వాతనైనా రోజా గురించి నాకు చెప్పవచ్చుకదా?" ఆవేశంగా అరిచాడు రాఘవ.

ఎప్పుడూ గంభీరంగా మూడే ముక్కలు మాట్లాడే రాఘవ ఇంతగా ఆవేశ పడటం చూసి ఆశ్చర్యపోయాడు రామ్.

'సరోజ ఎలాంటిదో ఏమోనని అనుమానించాను. సరోజ నడత మంచిది కాదేమో అందుకే చెప్పలేదు' అంటే రాఘవ ఇంకా ఆవేశ పడిపోతాడని రామ్ మౌనం వహించాడు.

రాఘవ ఆలోచనలలో పడ్డాడు.

సరోజమీద తనకున్న అధికారం ఏమిటి? గర్భిణి అని తెలిసిన రోజున దోషిగా అందరిముందూ నిలబడింది. సరోజ ముఖం దీనంగా కనిపించింది. దానికి కారకుడెవరో తెలియదు. ఆమె మనస్సు అప్పటికే యింకొక వ్యక్తికి అంకితమై పోయింది. ఆ చేదునిజం తలుచుకుని నీరుకారి పోయాడు రాఘవ. ఇప్పటికే ఇద్దరు జంటల పెళ్ళిళ్ళు జరిపించాడు. ఇప్పుడు సరోజ ప్రేమికుణ్ణి తెచ్చి పెళ్ళిచేస్తే తనకు తృప్తిగా ఉంటుంది. పాపం ఎవరూలేని ఆమెకు తను అండగా నిలిచి ఆమెపెళ్ళి జరిపిస్తానని ధైర్యంచెప్పాలి. ఇదివరకు నిర్మలా వాళ్ళ పెళ్ళి జరిపించేటప్పుడు ఏదో అనిర్వచనీయమైన తృప్తి పొందాడు. కాని ఇప్పుడు సరోజపెళ్ళి మరొకరితో జరిపి ఆనందంగా వుండగలడా? సరోజపెళ్ళి మరొకరితో జరిపించాలి, జరుగుతుంది అంటేనే ఏదో గుండెలు పిండినట్లు బాధపడ్తున్న తను, రేపు ఆమెపెళ్ళి జరుగుతుంటే చూడగలడా? నిజంగా ఆమెను తను ప్రేమిస్తున్నాడా? నిజమైన ప్రేమ అయితే స్వార్థం ఉండకూడదు. ఆమె సుఖపడాలి. ఆమె ప్రేమించినవ్యక్తిని ఎక్కడున్నాసరే వెతికి పట్టుకు

రావాలి. నయానో, భయానో అతన్ని తీసుకు వచ్చి సరోజకిచ్చి పెళ్ళి చేయాలి. ఒక దృఢనిశ్చయానికి వచ్చాడు రాఘవ.

"అయ్యగారూ ఫోను" నౌకరు వెంకన్న పిలుపుతో వెళ్ళాడు రాఘవ.

"ఫోను ఎక్కడ నుండి?" ఫోను పెట్టేసిన రాఘవతో అన్నాడు రామ్.

"మా చెల్లెలు లక్ష్మిదగ్గరనుండి. మా బావగారికి జ్వరం వచ్చిందట. ఆమె కంగారు పడుతోంది, నేను వెళ్ళి చూసివస్తాను. నువ్వూ వస్తావా రామ్?" రాఘవ అడిగాడు.
"లేదు రాఘవా! నేను కాస్సేపు విశ్రాంతి తీసుకోవాలి. రోజాకు చెప్పాను నేనిక్కడ ఉంటానని. తర్వాత ఆమె దగ్గిరికి వెళ్ళాలి నేను" రామ్ అన్నాడు.

"రాజూ! నేను లక్ష్మిఅత్తయ్య ఇంటికి వెడుతున్నాను. తాతయ్యకి చెప్పు. రామం బాబాయికి టిఫిన్, కాఫీలు చూడు."కి పెద్దన్నయ్య పెద్దకూతురు రాజేశ్వరికి చెప్పాడు రాఘవ.

"రామ్ నువ్వు ఆ గదిలో విశ్రాంతి తీసుకో" అని రామ్‌కు గది చూపించి వెళ్ళిపోయాడు రాఘవ.

"ఏమిటి బావగారూ! ఇంత కొంచెం జ్వరానికే మా చెల్లాయిని భయపెట్టేశారు?" కర్మామీటరు చూస్తూ అన్నాడు రాఘవ.

"నేను కంగారుపెట్టానా? తనకే కంగారు. ఫోనెందుకు లక్ష్మి అంటే వింటేనా? మధ్యాహ్నం తలనొప్పిగా ఉంటే ఆఫీసుకు సెలవుపెట్టి వచ్చేశాను. అప్పటినుండీ ఫోనుచేస్తాను

మా అన్నయ్యకు అంటుంటే, నేను ఇంతవరకు అపుచేశాను. కాని ఆఖరికి వినక...పిచ్చిది" భార్యను ప్రేమగా చూస్తూ అన్నాడు సుందరం.

"ఏమిటో అన్నయ్యా! ఈవూరు ట్రాన్స్‌ఫర్ అయి వచ్చి పదిరోజు లయిందో లేదో నాకు జ్వరం వచ్చింది. అది తగ్గేసరికి ఈయనకు పట్టుకుంది. నాకువచ్చినా ఫరవాలేదు కాని ఆయనకు మాత్రం రాకూడదు."

"ఛ! ఏమిటా మాటలు లక్ష్మీ! నీకువస్తే మాత్రం నాకు బాధగా వుండదా?" ప్రేమగా మందలించాడు సుందరం.

"నా మూలంగానే మీకువచ్చింది. కావాలంటే నాన్న నడుగన్నయ్యా! నాకు వచ్చిన వారం రోజులూ పగలు అటు ఆఫీసుపని అయితే, రాత్రంతా నాదగ్గరే మేలుకుని కూర్చుని మందులు ఇచ్చేవారు. మీరు పడుకోండి అన్నా వినేవారుకాదు" ఆప్యాయంగా భర్తకేసి చూస్తూ అంది లక్ష్మి.

"పోనిద్దూ! నీకు తగ్గింది నాకంతే చాలు" తృప్తిగా చూశాడు లక్ష్మి కళ్ళల్లోకి సుందరం.

లక్ష్మిఅంటే అతనికెంత ప్రేమో లక్ష్మికి జ్వరం వచ్చినప్పుడు ప్రత్యక్షంగా చూడనే చూశాడు రాఘవ.

"ఏమో! మీరేం మనండి. మీకేదైనా వస్తే నాకు కాళ్ళు, చేతులు ఆడవు. పాడు జ్వరం మీకేరావాలా? అప్పుడే యింకో రెండురోజులు నాకే ఉండిపోకూడదూ." భర్త కాళ్ళువత్తుతూ అప్యాయంగా అంది లక్ష్మి.

వాళ్ళ ప్రేమానురాగాలు చూస్తుంటే రాఘవకు

ఆనందం కలిగింది. వారంరోజుల క్రితం తనకి జ్వరం వచ్చి నప్పుడు తనని ఆప్యాయంగా ఎవరు చూశారు? తల్లిలేదు. తల్లిలాంటి వదినలేదు. కష్టసుఖాలలో తోడునీడగా భార్యా భర్తలు ఒకరి కొకరు ఉంటే ఎంత అందం, ఎంత ఆనందం! తను ఆ భాగ్యానికి నోచుకోలే దన్నట్లు ఫీలయ్యాడు రాఘవ.

"అన్నయ్యా కాఫీ త్రాగేసి వెళ్ళిపోకు. కాసేపు కూర్చో. నేను పిల్లలకు అన్నాలుపెట్టేసి వస్తాను. రాత్రికి నాన్నగారిని పంపు" కాఫీకప్పు అన్నగారికిస్తూ అంది లక్ష్మి. ఏమిచేయాలో తోచక గదంతా కలియచూస్తున్న రాఘవ దృష్టి అలమారులోవున్న అల్బంమీద పడింది. అది తీశాడు.

"బావగారూ! మంచి కాలక్షేపం. అందులో మీ చెల్లెలి పెళ్ళిఫొటోలు చూడండి. ఎంత అందంగా వున్నదో మీ చెల్లెలు చూదురుగాని. ఇలా ఇవ్వండి నేను చూపిస్తాను" భార్యవైపు వెక్కిరింతగా చూస్తూ అన్నాడు సుందరం.

"నేను బాగాపడలేదని హేళన అన్నయ్యా! మీరవి చూస్తూండండి నేనువస్తా." లక్ష్మి వెళ్ళిందిలోపలకు. వాళ్ళ పెళ్ళిఫొటోఆల్బం సుందరం చేతిలోపెట్టి, రెండో ఆల్బం తిరగేయటం ప్రారంభించాడు రాఘవ. యాంత్రికంగా పేజీలు తిరగేస్తున్న రాఘవ, అందులోని ఒక ఫొటోచూసి ఉలిక్కిపడ్డాడు. ఆ పెద్ద పెద్ద కళ్ళు కొంటెగా తనవైపు చూస్తున్నట్లు ఫీలయ్యాడు. ఎంతో అమాయకంగా ఉంది ఆ అమ్మాయి వదనం, పదహారేళ్ళకంటే వుండవు ఆమెకు. అచ్చు పల్లెటూరి పిల్లలా వుంది ఆమె వేషం.

"ఎవరిదో యీ ఫొటో" అప్రయత్నంగా రాఘవ నోటినుండి బయటకు వచ్చాయి మాటలు.

"ఏదీ ఏ ఘాటో? ఓహో! సరోజదా. పాపం ఎంత అందమైనదీ, ఎంత తెలివైనదీ, చనిపోయింది. నా పెళ్ళికి ముందరే చనిపోయింది" సుందరం గొంతులో విషాదం ధ్వనించింది.

"ఎందుకు చనిపోయింది?" అనుకోకుండానే అడిగాడు రాఘవ.

"ఎందుకంటే ఏం చెప్పను? ఆమెదీ, మాదీ ఒకేఊరు. మారవు బంధుత్వంకూడా ఉంది. తండ్రిఒక్కడు తప్ప ఆమె కెవ్వరూ లేరు. ఎప్పుడూ మాతోటి ఆడుతూ పాడుతూ అల్లరి చేసేది చిన్నతనంలో, మాతో సమానంగా చెట్లు అవీ ఎక్కేది. ఎంతో హుషారుగా ఉండేది. ఆ సు పదు నెనిమిదేళ్ళు ఉన్నప్పుడు తండ్రికి జబ్బు చేసింది. ఒకరోజు మధ్యాహ్నం ఆయనకు ఆయాసం ఎక్కువ కావటంతో వెంటనే ఆస్పత్రికి వెళ్ళింది సరోజ. కాని మధ్యాహ్నం కావటం చేత ఆస్పత్రిలో ఎవరూ లేరు. ఆస్పత్రి ఆవరణలోనే ఉన్న డాక్టరుగారి క్వార్టర్సుకు వెళ్ళింది. అప్పుడు డాక్టర్ గోపాల్ అనేఅతనుపని చేసేవాడు. వాడు పరమ దుర్మార్గుడు" సుందరం ముఖం కోపంతో కందిపోయింది. ఆ ఆవేశంలో చెప్పలేక ఆగిపోయాడు.

"ఏమయింది బావగారూ" ఆత్రుతగా అడిగాడు రాఘవ. జరగరాని పని జరిగిపోయింది. ఆ డాక్టరు పశుబలానికి సరోజ బలి అయిపోయింది.

"ఈలోగా నేను సరోజ ఇంటికి వెళ్ళాను. "బాబాయ్! సరోజ ఎక్కడ ?" సరోజ తండ్రి నడిగాను. డాక్టరుగారి దగ్గరకు వెళ్ళింది బాబూ. అప్పుడే చాలా సేపయింది. ఇంకా

రాలేదు. వయసు వచ్చింది కాని అల్లరి తగ్గలేదు. ఎక్కడైనా ఏ జామకాయలన్నా కోసుకు తింటోందేమో" ఆయాసంతో ఆయనకు మాటలు రావడం లేదు. "ఎంత చిలిపిదైనా, ఎంత పెంకిదైనా నన్ను బాగా చూసుకుంటోంది చెల్లాయ్! నేను వెళ్ళి చూసి వస్తాను" అంటు గబగబా వెళ్ళాను. సరిగ్గా నేను వెళ్ళే సరికి సరోజ బయటకు వస్తోంది. జుట్టంతా రేగిపోయి వణికిపోతూ, చెమటతో, భయపడుతూ, డాక్టరింటి బయటకు వస్తున్న ఆమెను చూడగానే నాకేదో భయంవేసింది.

నన్ను చూసి 'అన్నయ్యా' అంటూ బావురుమంది. ఆ రోజు ఆమెముఖం ఇప్పటికీ నాకు గుర్తుంది. అవమానంతో అభిమానంతో, అసహాయురాలిలా నిలబడ్డ ఆమెనుచూస్తుంటే ఎటువంటి కఠినాత్ముడికైనా గుండె కరుగుతుంది. ఆ సమయంలో గోపాల్ ని చంపేయ బుద్ధి పుట్టింది. ఆవేశంగా లోపలకు వెళ్ళబోయాను. 'వద్దు అన్నయ్యా! జరిగిందేదో జరిగింది. నలుగురిలోను గొడవ అయితే నేను ముఖమెత్తుకు తిరగగలనా? సరోజ ఏడుస్తూ ఆపుచేసింది.

'సుందరం ఈ విషయం ఎవరితోటి చెప్పనని ప్రమాణం చేయి' అంటూ ప్రమాణం చేయించుకుంది. ఇద్దరం ఇంటికి వచ్చేసరికి ఆమె తండ్రి నిర్జీవంగా పడివున్నాడు. ఆ సమయంలో ఆమె ఏడవలేదు. ఎంతో వైరాగ్యం సంతరించుకున్న దానిలాగా, ఎన్నో ఏళ్ళుఎదిగిపోయినట్లు, ఏదో నిశ్చయించుకున్న దానిలా ధైర్యంగా నిలబడింది. ఈమె కాని ఆత్మహత్యకు పాల్పడదు కదా! అని అనుమానం వచ్చింది నాకు. 'సరోజా నువ్వు నాకొక వాగ్దానం చేయాలి' ఏమిటి అన్నట్లు చూసింది. 'పిచ్చి అన్నయ్యా! ఒకనాడు నేను చావ

దలుచుకుంటే, నేను చేసే వాగ్దానం నాకే విధంగా అపకారం చేస్తుంది? ఎప్పుడూ వాగ్దానాలు అడగకు. అందులో ఇలాంటి విషయంలో" అంటూ నన్ను మభ్యపెట్టి తండ్రి దహన క్రియలకు ప్రయత్నాలు ప్రారంభించింది.

ఆ రోజు రాత్రి నాకు జాబు వ్రాసిపెట్టి వెళ్ళిపోయింది. ఆ జాబులో తనీ అవమానాన్ని భరించలేననీ, ఆత్మహత్యే తనకు శరణ్యమనీ, తనగురించి వెతకవద్దనీ ఏమిటో వ్రాసింది. ఆమె ఆత్మహత్య చేసుకుని ఉంటుందనే తీర్మానానికి వచ్చాం. పాపం ఎంత మంచిపిల్ల! ఎంత అల్లరి చేసినా, పెంకిగా సమాధానం చెప్పినా, నీతిగా, నిజాయితీగా నిక్కచ్చిగా మాట్లాడేది. "అన్నయ్యా! నీ పెళ్ళికి ఆడపడుచు లాంఛనాలన్నీ నాకే అంటూ సంతోషంగా తిరుగుతుండేది." సుందరం ఆగాడు.

రాఘవకు ఆరోజు గుర్తుకు వచ్చింది. చిన్నన్నయ్య ఉన్న ఊళ్ళోనే తను లెక్చరర్ గా ఉండేవాడు. చిన్నన్నయ్య వుండేవూరు లక్ష్మి అత్తవారి వూరికి ఐదు మైళ్ళు ఉండవచ్చు. ఆరోజు తను తొలిఆట సినిమాకు వెళ్ళి సినిమా బాగుండనందున మధ్యలోనే లేచి బయటకు వచ్చేశాడు. కాసేపు ఎటయినా తిరుగుదామని రోడ్డమ్మట తిరగటం ప్రారంభించాడు. ఒకచిన్న చెరువులాంటిది కనిపించింది. అక్కడ మెట్లమీద కాసేపు కూర్చుందామనిపించి వెళ్ళేసరికి ఒక యువతి గబగబా మెట్లు దిగుతోంది. తనకు ఏదో అనుమానం వచ్చి గబగబా తనుకూడ మెట్లుదిగటం ప్రారంభించాడు. ఆ చెరువులోకి దిగబోతున్న ఆమెను చెయ్యి పట్టుకుని వెనక్కు లాగాడు. తూలి తనమీద పడింది. పడ

కుండా గట్టిగా పట్టుకున్నాడు తను! ఏమిటో షాకు తగిలినట్లు అనుభూతి తనకు, ఆమె భయం భయంగా తన వైపు చూసింది. ఆ వెన్నెలలో ఆమె నల్లని కళ్లు వర్షించే మేఘాల్లా ఉన్నాయి. ఆ కళ్ళల్లో భయాన్ని పోగొట్టి ఆమెను బుజ్జగించాలి అనిపించింది తనకు. ఆమె ముఖంలోని భయం చూసి ఇతనికీ చటుక్కున గుర్తుకు వచ్చింది. ఆమెను తను పట్టుకునే వున్నాడింకా. ఆమెను వదిలేసి, "రండి నాతో" అన్నతన మాట ఆజ్ఞలా అనిపించింది తనకే.

"ప్లీజ్ నాదారికి నన్ను వదిలేయండి" దుఃఖాన్ని దిగమింగుతూ అన్నాదామె.

"ఇంత చిన్న వయసులో ఆత్మహత్య చేసుకుందామనే బుద్ధి ఎందుకు పుట్టింది? జీవితమంతా ముందేవున్నది."

"జీవితం మీద విరక్తి కలిగినప్పుడు రావటానికి చిన్నా పెద్దా అనే రూలు లేదుగా" ఘాటుగా అంది.

"మీ పేరేమిటో గాని మీరు జీవితంలో ఏం చూశారు? విరక్తి కలగటానికి? ఈ జీవిత పోరాటంలో కష్టాలు సుఖాలు వుంటుంటాయి"

"నేనిప్పటికే అలసిపోయాను. నాకు జీవించాలనే కోరిక లేదు. వదలండి నన్ను." అతని చేతిలో వున్న తనచేయి లాక్కోవటానికి పెనుగలాడింది.

"చూడండి మొండితనం చూపించారంటే మిమ్మల్ని ఎత్తుకొని తీసుకొని వెడతాను" మొండిగా అన్నాడు తను.

నిజంగా ఆ పని చేస్తాడేమో నని భయపడింది ఆమె.

"నన్ను ఎక్కడకు తీసుకు వెడతారు?" భయం కళ్ళల్లో కనిపించింది.

"అదేమిటి నీకెవరూ లేరూ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఉంటే యిలాంటి పనెందుకు చేస్తాను?" నీరసంగా అంది.

ఒక్క నిమిషం ఆలోచించి "సరే! నాతో రండి" ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా అన్నాడు తను.

"మీ యింటికా? నాకు ఎవరిమీదా ఆధారపడి బ్రతకటం యిష్టంలేదు."

"నా మీద ఆధారపడి బ్రతకమనలేదు. మీకు ఏదో ఒక దారి చూపించే పూచీ నాది."

"అయితే ఒక షరతు. నేనీవిధంగా ఆత్మహత్యకు తలపడ్డప్పుడు మీరు రక్షించినట్లు ఎవరికీ చెప్పకూడదు. నా ఆత్మహత్యకు కారణమేమిటని మీరు ఎప్పుడూ అడగకూడదు." బుద్ధిమంతుని వలె తలూపాడు.

అప్పుడు ఆమెను, తను రామ్ ఇంటికి తీసుకువెళ్ళి కొన్నాళ్ళు అక్కడ వుండనీయమని అడగటం, తరువాత ఆమె గర్భిణి అని తెలియటం, ఆమెను రోజా, దుర్గ నిందించటం, తను వేరే యింట్లో ఆమెను పెట్టటం గర్భం పోవటం, ఆమె వెళ్ళిపోవటం, అన్నీ కళ్ళకు కట్టినట్టు కనిపించాయి.

ఇన్నాళ్ళూ ఆమె ఎవరినో ప్రేమించి వాడివలన మోసగింపబడి ఆత్మహత్యకు ప్రయత్నించిందనీ, లేదా విధి వాళ్ళిద్దర్నీ విడదీయటంలో ఈమె తొందరపడి ఆత్మహత్య చేసుకుందామనుకుందనీ ఏదేదో అనుకున్నాడు. ఇప్పుడర్థమయింది ఆమె ఎవరినీ ప్రేమించలేదని.

"ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?" సుందరం అడిగాడు. వెంటనే రాఘవకు ఒక ఆలోచన తట్టింది. రామ్‌ని

తీసుకుని ఆమె దగ్గరకు వెళ్ళాలి. దానితో నిజం తెలుసు కుంటుంది ఆమె.

"సుందరం ఆమె చనిపోలేదు. బ్రతికే ఉంది."

"యెక్కడ ఉంది. మీ కెలా తెలుసు"" ఆనందంగా ఆదుర్దాగా అడిగాడు సుందరం.

"ఇదేవ్వూళ్ళో! మీరు వస్తానంటే చూపిస్తా."

"ఇప్పుడే వెళ్దాం" లేచాడు సుందరం.

"జ్వరంతో నే!" ఆశ్చర్యంగా అంది లక్ష్మి.

"ఈ కాస్త జ్వరానికేనా భయం?" నిర్లక్ష్యంగా అన్నాడు సుందరం.

"లక్ష్మి, నువ్వూ పిల్లలూ అంతా ఇవాళ ఇక్కడే వుండకూడదని లేదండి" అన్న ఉత్సాహం చూసి ఆశ్చర్య పోయింది లక్ష్మి.

"రామ్" అంటూ ఇంట్లో అడుగు పెట్టిన రాఘవను. అతని వెనకే వచ్చిన సుందరం, పిల్లలనూ చూసి–

"ఏమిటిబ్బాయ్" అన్నారు శివరావుగారు.

"లక్ష్మి వాళ్ళను ఇక్కడే వుండమన్నాను నేను. ఇంతకీ రామ్ ఏడీ?" ఆత్రుతగా అడిగాడు రాఘవ.

"రాజా! రామ్ బాబాయ్ ఏదో చీటి ఇచ్చాడు కదే, రాఘవ బాబాయ్ కిమ్మని? పట్టుకురామ్మా" శివరావుగారు రాజేశ్వరిని కేకేశారు.

చీటీ చదివిన రాఘవ ముఖంలోని మార్పులు చూసి "ఏమిటబ్బాయ్?" అని శివరావుగారు అడిగారు.

"ఏం లేదు. ఇప్పుడే వస్తానుండండి."

"అదేమిటి సర్, రోజాను చూపిస్తానని నాకు చెప్పి మీరు వెళ్ళిపోతున్నారేమిటి?" సుందరం అడిగాడు.

"ఒక స్నేహితుడికి ఏక్సిడెంటయిందట. అదేదో చూసి వస్తాను ఇప్పుడే" వెళ్ళిపోతూనే చెప్పాడు రాఘవ.

"చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం అనుభవించవద్దూ? ఆయనకు ఏక్సిడెంటయింది. ఒక కాలు పనికిరాకుండా పోయింది. ఇన్నాళ్ళూ గోపాల్ చేసే పాపాలకూ, నేను చేసే పాపాలకూ శిక్ష నే నే గాఅనుభవించేది?

రాఘవా! ఇప్పుడు గోపాల్ మళ్ళీ పెళ్ళి చేసుకోలేడు కదూ! హా హా హా" ముందర దుఃఖంతో మాట్లాడటం మొదలు పెట్టిన రోజా,తరువాత పిచ్చిగా నవ్వుతూ మాట్లాడుతుండేసరికి రాఘవకు ఎంతో బాధ కలిగింది. ఆమె ఎలాంటిదయినా, ఎలాగ ప్రవర్తించినా ఆమె సుఖంగా ఉండాలని తాను ఎప్పుడూ కోరుకుంటాడు.

"ఏమిటి రాఘవా! బాగా అయిందనుకుంటున్నావు కదూ! నువ్వే నన్ను పెళ్ళి చేసుకునివుంటే నాకీ నరకయాతన ఉండేదా? దీనికంతటికీ కారణం నువ్వు. నువ్వే పో! నా కళ్ళ ముందర ఉండకు." రాఘవ మీదికి ఆవేశంగా రాబోయింది రోజా.

"రోజా! ఏమిటిది? ఇక్కడ ఇలా గొడవ చేయవచ్చా?" తల్లి పిల్లను మందలించే స్వరంలో అన్నాడు రాఘవ. ఆ మాటలతో ఆగిపోయింది రోజా. అతను ఎప్పుడు మాట్లాడినా అలాగే మాట్లాడతాడు.

"రామ్! రోజాకు కాఫీ తీసుకురా. గోపాల్ ఆపరేషన్ అయ్యేవరకూ ఇక్కడే ఉంటాను" రాఘవ అనటంతోనే

రామ్ వెళ్ళాడు. వెళ్ళిన రామ్ సరోజతోనూ, కాఫీ ఫ్లాస్కు-తోనూ తిరిగి వచ్చాడు.

రాఘవకు సరోజను చూడగానే ఏదో ఆనందం, ఆమె తనని అపార్థం చేసుకుందనే దిగులూ రెండూ ఏకమయ్యాయి.

సరోజను చూస్తూనే రోజా మొహం వెలవెల బోయింది.

“సరోజా నన్ను క్షమించు. నా రాఘవను ఎక్కడ ఎత్తుకు పోతావో అనే భయంతో ఫూరినుండి వెళ్ళగొట్టాను. ఇక్కడ మళ్ళీ రాఘవను ఎక్కడ కలుసుకుంటావోనని అతని మీద లేనిపోనివన్నీ చెప్పాను. అలాంటి నన్ను చూట్టానికి వచ్చావా? నేను పాపిష్టి దాన్ని సరోజా! పాపిష్టిదాన్ని” రెండు అరచేతుల్లోను ముఖం దాచుకుని ఏడ్వసాగింది రోజా.

సరోజ ఏం అర్థంకానట్టు చూస్తుండిపోయింది.

“ఏమిటిది రోజా? కాఫీ తీసుకో” ఆజ్ఞాపూర్వకంగా అన్న రాఘవ మాటలతో, మాట్లాడక కాఫీ తీసుకుంది రోజా.

“సరోజా! మళ్ళా యిక్కడకు వచ్చావు. నీవల్లే రాఘవకూ నాకూ పెళ్ళికాకుండా పోయింది. నువ్వు పెట్టిన శాపం వల్లనే నాకు శాంతి లేకుండా పోయింది. నేను కష్టాల్లో వుంటే చూసి సంతోషిద్దామనా?” సరోజను ఒక్క తోపు తోసింది రోజా. అది స్పెషల్ వార్డులో ‘ఎ’ క్లాసురూమ్ కావటంతో సరిపోయింది. కాని బయటయితే! గోపాల్‌కు ఆపరేషను చేసాక అక్కడ వుంచుదామని డాక్టర్లు ఆ రూములో కూర్చోమన్నారు రోజా వాళ్ళను. రోజా ఆరోగ్యం అంతంత

మాత్రంగా ఉండటంతో రామ్ ఆపరేషను థియేటరు దగ్గర నుంచో కుండా ఆ గదిలోనే ఉండిపోయాడు రోజాతో.

"ఏమిటి రోజా! మాట్లాడకుండా కూర్చోమని చెప్ప లేదూ?" రోజా తోపునకు పడపోయిన సరోజను పట్టు కుంటూ కోపంగా అన్నాడు రాఘవ.

నిర్లక్ష్యంగా తల ఎగరవేసి కూర్చుంది రోజా ఎటో చూస్తూ.

"రోజా భర్తకు ఏక్సిడెంటు అయిందని, ఆపరేషను చేస్తున్నారని రామ్ చెప్పాడు. చూసి పోదామని వచ్చాను" బెదురుగా అంది సరోజ రాఘవతో.

"అసలు నువ్విక్కడికి అంటే, హాస్పిటల్ ఆవరణకు ఎందుకు వచ్చావు సరోజా?" రాత్రి ఎనిమిది గంటలవు తోంది. అప్పుడు అంత చీకట్లో సరోజ ఒంటరిగా తిరగటం యిష్టం లేకపోయింది రాఘవకు. అందుకే అడిగాడు.

"ఎందుకేమిటి? నిన్ను చూట్టానికి. నిన్ను లాక్కుపోవ టానికి నన్ను చూసి సంతోషించటానికి" హేళనగా అంది రోజా.

"రోజా! కాస్సేపు పడుకో ఆ మంచంమీద" రామ్ అన్నాడు. రామ్ కేసి కోపంగా చూసి పడుకుంది రోజా.

"మా మేనేజరుగారికి బ్లడ్ ప్రెషర్ ఎక్కువయితే అడ్మిట్ చేశారు. చూసిపోదామని వచ్చాను" సరోజ మెల్లిగా అంది.

"రాత్రి ఎందుకు పగలు చూడవచ్చును కదా?" అలా అడుగుతున్నానేమిటా అని అతనికే ఆశ్చర్యం వేసింది.

'తను రాత్రి చూడటానికి వస్తే అతనికేం, పగలు

చూట్టానికి వస్తే యితనికేం!' అనుకుంది సరోజ. అయినా అతనలా అధికార పూర్వకంగా, తను రాత్రి రావటం అయిష్టంగా వున్నట్లు మాట్లాడటం ఏదో తృప్తినీ, మరేదో హాయినీ కలిగించింది.

"ఫెస్టివల్ దగ్గరల్లో వస్తుందికదా! షాపులో వూపి రాడని పని ఉంటుంది పగలంతా. అందుకని..." సంజాయిషీ చెప్తున్నట్లు మాట్లాడిన సరోజ మాటలు, చెప్పే విధానం రాఘవకు ఎంతో నచ్చాయి.

ఇది వరకు రోజాతో ఇలా కనుక మాట్లాడితే "బాగుంది నువ్వు ఆడదాని స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని అరికట్టాలని చూస్తున్నావు. లేకపోతే ఆ ఆజ్ఞ లేమిటి, మంచినీళ్లు తాగటానిక్కూడా నీ పర్మిషనేనా" అనేది. తన మనస్సు చివుక్కు మనేది.

"నేను వస్తానండి" రామ్మనూ రాఘవనూ వుద్దేశించి అన్నది సరోజ.

"క్షమించండి సరోజగారూ! ఆ రోజు రోజాతో పాటు నేనుకూడా మీ ఇంటికి వచ్చాను. రోజా మిమ్మల్ని వెళ్ళి పొమ్మంటే ఏం మాట్లాడలేకపోయాను. రాఘవకు రెండు సంబంధాలు కుదిరినట్లే కుదిరి చెడిపోయాయి. అంటే ఆమె వాటికి చిలవలూ పలవలూ పెట్టి మీకు చెప్పింది. ఇందులో నేను కూడా దోషిని. రాఘవలాంటి స్నేహితుణ్ని బాధ పెట్టాను."

"అవన్నీ ఇప్పుడెందుకు కాని, సరోజా నడు, నే దిగబెట్టి వస్తాను" రాఘవ సరోజను తీసుకు వెళ్లాడు.

"క్షమించండి రాఘవగారూ! తొందరపడి మిమ్మల్ని

ఏదో అన్నాను. ఇప్పుడు దారిలో రామ్ అన్ని సంగతులూ చెప్పారు" కారులో కూర్చుంటూ అంది సరోజ.

'రామ్‌కి అన్నీ తొందరే. క్రిందటిసారి రామ్ వచ్చినప్పుడు తన్ని నిలదీశాడు. పెళ్ళి నిశ్చయమవుతుండటం, ఆ అ అమ్మాయిల్ని చేసుకోకపోవటం. ఇదంతా ఏమిటి రాఘవా?' అంటూ బాధ పడ్డా

అప్పుడు తను రామ్‌తో అన్నాడు 'రామ్! నీ స్నేహితుడు నిలకడలేని వాడనుకుంటున్నావ్ కదూ! అందేంకాదు' అంటూ ఏవో కారణాలవలన రోజా నిర్మలనూ పార్వతిని చేసుకోలేకపోయాడో చెప్పాడు. అవన్నీ! అప్పుడే రామ్ సరోజకు చెప్పేసినట్టున్నాడు!

"ఇదేమిటి కారు యీ దారిని వెడుతుంది" సరోజ ప్రశ్నతో ఆలోచనలకు స్వస్తి చెప్పి.

"వెళ్ళాల్సిన చోటికి వెళ్తుంది" చిలిపిగా ఆమెకేసి చూస్తూ అన్నాడు రాఘవ.

అతనింటి ముందు కారాగటం చూసి "ఇదేమిటి ఇది మీ ఇల్లా? నన్ను యిక్కడకు తీసుకువచ్చారేమిటి?" తడబడుతూ అడిగింది సరోజ. "నా యిల్లు కాదు ఇకనుంచి మన యిల్లు" ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు రాఘవ.

అతని మాటలకు, చూపులకు ఆమెలోని ప్రతి అణువు పులకించినట్లయింది.

"ఏమిటి బావగారూ! సరోజ దగ్గరకు వెళ్దామని అంటూ ఎక్కడికో వెళ్ళిపోయారు" లోపల హాల్లోకి వస్తూ అంటున్న సుందరం హాల్లోని సరోజను చూసి ఆశ్చర్యపోయాడు.

"సరోజా ఎన్నాళ్ళకి! రాఘవ యిక్కడికే తీసుకు వచ్చాడన్న మాట."

సుందరాన్ని చూస్తూనే తెల్లబోయింది సరోజ.

"నువిక్కడికెలా వచ్చావు సుందరం!" ఆశ్చర్యంతో ఆమె కళ్ళు మరింత పెద్ద వయ్యాయి.

"అతను మా చెల్లెలి భర్త" రాఘవ అన్నాడు.

అంతవరకూ రాఘవ యిందాకా అన్న మన యిల్లు. అన్నమాటతో పరవశమవుతూ ఊహాలోకాల్లో విహరిస్తున్న ఆమె మనస్సు ఒక్కసారిగా క్రిందకు పడిపోయినట్లయింది. ఆమె కలలు చెరిగిపోయినట్లయ్యాయి. రాఘవకు సుందరం అంతా చెబుతాడు. అప్పుడు రాఘవ తనను స్వీకరిస్తాడా? తన తప్పులేకపోయినా శిక్షతనే అనుభవించాలిగా! అయినా తనపిచ్చికాని రాఘవకు తెలీదా ఏమిటి తను గర్భిణి కావటం, అది పోవటం ఆ మానసిక సంఘర్షణలో ఆమెకు చెమటలు పట్టసాగాయి.

"అదేమిటి సరోజా! ఒక్కసారి అలా చెమటలు పడుతున్నాయి, ఎందుకంత నీరసించిపోయావు?" గాభరాగా అడిగాడు రాఘవ. అడిగేతీరు, ఆమెను ఏకవచనంతో సంభోదించటం సుందరం గమనించకపోలేదు.

"సరోజా! ఎన్నాళ్ళకు చూడగలిగాను నిన్ను? లక్ష్మి ఇన్నాళ్ళ నీకు ఆడబిడ్డలు లేరనుకున్నావు. ఇదుగో యిక్కడనుండి నీకు అర్థ మొగుడు వచ్చింది" సరోజ పరిస్థితి పెద్దగా గమనించకుండా భార్యను పిలిచాడు సుందరం.

"ఏమండి బావగారూ! ఇవేళ నాకెంతో సంతోషంగా

ఉంది. మనం పిక్చర్ కు పోవాలి. లక్ష్మీ! తొందరగా తయా రవ్వు" సుందరం హడావుడిపడిపోతున్నాడు.

అలాగే అంటూ "సరోజా! నువ్వుకూడా తయారవ్వు. రామమ్మని ఒక కారియర్ లో ఇద్దరికి సరిపడా భోజనం పెట్టమను." అందరికి భోజనాలు పెట్టేయమను. రాఘవ ఆర్డరు జారీ చేశాడు.

"కేరియర్ ఎవరికి?" లక్ష్మి అడిగింది.

'రామ్ కూ,రోజాకు తెస్తానని చెప్పాను.'

రోజా, రామ్ లు ఆశ్చర్య పోయారు. రాఘవ కేరి యర్ తో ఒక్కడే కాకుండా, సరోజ తోనూ, యింకో కొత్త వ్యక్తి తోనూ అడుగు పెట్టేసరికి, గ్రహించాడు రామ్ ఆ కొత్త వ్యక్తి సుందరం అని.

సరోజ, సుందరంల దృష్టి మంచంపై ఉన్న గోపాల్ మీదపడింది.

"అతను...అతను డా. గోపాల్ కదూ! తనని అవస్థ పాలు చేసినవాడు" అవమానంతో, కోపంతో సరోజ ముఖం ఎర్రబడింది

సుందరాని క్కూడా అతన్ని చూడగానే కోపం పెల్లు బికింది.

"రామ్, నువ్వూ రోజా ఇక్కడ భోజనం చేసి పడు కోండి. నేనువస్తాను. ప్రొద్దుట కలుద్దాం. రా సరోజా" అని సరోజ, సుందరం లతో బయటకు రాబోయాడు రాఘవ. కాని కోపం వాళ్ళ ముఖంలో కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. గోపాల్ కు మాత్రం ఇంకా స్పృహ రాలేదు. నిద్రపోతు న్నాడు.

"ఏమిటి సరోజా! నువ్వూ బావగారూ కూడా అలా ఉన్నారేమిటి?" రాఘవ గాభరాగా అడిగాడు.

"సరోజా! మీ ఆయనా? ఆయనను నాకు పరిచయం చేయలేదేం?" రోజా సంతోషంగా ముందరకు వచ్చింది రాఘవ సరోజను చేసుకోలేదు కదా అని ఆమె ఆనందపడింది.

"నేను సరోజకు అన్నగారిని" కోపంగా అన్నాడు సుందరం.

"అన్నగారా! హహహ! ఇన్నాళ్ళనుండి ఎక్కడకు వెళ్ళారింకేం అన్నగారూ?" వెటకారం ధ్వనించింది రోజా కంఠంలో.

"ఊరుకో సుందరం! ఆమెకు ఒంట్లో బాగులేదు" మెల్లిగా అన్నాడు రాఘవ.

"రాఘవా నన్ను ఇక్కడినుంచి తీసుకుపోండి" ఏడుస్తూ అంది సరోజ.

"పదండి బావగారూ"! సుందరం కూడా అన్నాడు.

"ఏముంది సుందరం?" రాఘవ ఆత్రుతగా అడిగాడు

"వాడే! సరోజ జీవితాన్ని నాశనం చేసినవాడు" సుందరం అన్నాడు

అయితే, సుందరం ఇదివరకే రాఘవకు అన్నీ చెప్పాడన్నమాట! తనముందు అంతా తిరిగి పోతున్నట్లయి, నీరసంగా రాఘవ గుండెలమీద వాలిపోయింది సరోజ.

"సరోజా! ఏమైంది?" సరోజను నెమ్మదిగా కారులో పడుకోపెట్టాడు రాఘవ.

"సినిమా వద్దు, ఏంవద్దు. సరోజ నీరసంగా ఉంది యింటికి పోదాం" అన్నాడు రాఘవ.

* * * *

సరోజను మధ్యనుధ్య ఏడిపిస్తూ ముస్తాబు చేస్తోంది. లక్ష్మి. సరోజకు లోపల ఎంతో ఆనందంగా ఉంది. ఆమె యిప్పుడు ఐ. ఎ. ఎస్. ఆఫీసర్ రాఘవ భార్య. అందగాడు, పెద్ద ఆఫీసరు. అన్నింటికిమించి సంస్కారం, సభ్యత విశాల భావాలు కలబోసిన ఉత్తమునికి అగ్నిసాక్షిగా నిన్న రాత్రి భార్య అయింది. ఇలా జరుగుతుందని ఆమె కలలో కూడా అనుకోలేదు పదిరోజుల క్రిందట.

సరిగా పదిరోజుల క్రిందట "నిన్ను పెళ్ళిచేసుకోవాలను కుంటున్నాను. నీ అభిప్రాయం ఏమిటి సరోజా?" అని రాఘవ అడిగినప్పుడు ఆమెలో ఆశ్చర్యానందాలతో పాటు భయం కూడా చోటు చేసుకుంది. గోపాల్ విషయం కాలు విషయం తెలిసీ కూడా అతనలా ఎందుకు అడుగుతున్నాడా" అను కుంది. అదే విషయం రాఘవను అడిగింది.

"నా గత చరిత్ర మీకు తెలిస్తే..."

"ఆడదానివనిపించుకున్నావు సరోజా!" ఆమె మాట పూర్తి కాకుండానే అన్నాడు రాఘవ. అరోజు గోపాల్ చేసిన తప్పుపనికి జీవితాంతం శిక్షను సాధ్వి అనుభవించాలా?" అంటూ బుజ్జగించాడు రాఘవ.

ఏలమ విస్తృతంగా
మలుపబడిన నవల